1

శ్రీరస్తు.

శ్రీ మార్కండేయస్వామినే నమః.

# వా ర కాం త.



## ప్రథమవిలాసము.

### దైవప్రార్థనము.

ఉ. శ్రీమదుమామహేశ్వరులు చిన్మయరూపులు సత్కటాక్షవీ
క్షామృతవృష్టిభక్తసుజనాళిపయిన్వెదఁజల్లుచుంగడుం
బ్రేమమెలర్పనేలుమహిభృత్కులదీపములైనవారుమ
మ్మోముచునుండ్రుగావుతసముచ్ఛ్రితకాంక్షితకార్యసిద్ధులన్.

### కృ తి క ర్త.

సీ. హారిగోత్రపవిత్రమైనమంత్రిప్రెగ
డాన్వయమందుదయంబునంది
సతతమార్కండేయశంభుపాదాబ్జసం
సేవచేఁగవితావిశేషమంది
యలరుభుజంగరాయాభిధానుఁడ వార
వనితలదుష్ప్రవర్తనలుకొన్ని
మదికి నాశ్చర్యంబునొదవింపవివరించు
గ్రంథమొక్కటివారకాంతయనఁగ
గీ. నేరచించెదనీకృతికీశ్వరుండె
యీశ్వరుఁడుగాఁగ నేనువేలేంప్లకలియు

గమునజరుగవికారివర్షమునమాఘ
వాఖ్యమాసమునందగునాదిదశమి. 2
క. నీదయఁగలుగఁగనాకిం
కేదిక్కొఱఁతయనుచునెంచియీకృతిఁజేయన్
మోదించుచుంటి హైమవ
తీదయితా! చిత్తగించుదీనింగృపతోన్. 3

## కథాప్రారంభము.

చ. చందురుఁడున్నతిందనరుసౌధతలంబులనుబూర్ణచంద్రికం
బొందికగాసుధారసముబూసెడుదాసునిపోల్కెఁగ్రమ్మఁగన్
మందగతింజరించుచటుమాని చనందలపూనఁడేమొయీ
చందముమానసంబునకుసమ్మదముంబొనరించెనెంతయున్. 4
క. రిక్కలుబహుత్స్రముచెంతం
గ్రిక్కిరియఁగఁబాదరసపుగిండియలందున్
జెక్కులునిల్పినపోలికఁ
జక్కఁగవజ్రములుదాఁపుచొప్పుననలరున్. 5
సీ. సొబగుగానీచెంతసోరనగండ్లలో
మల్లెపువ్వులగుత్తులల్లుకొనియె
మురువొప్పసోపానములకిరుప్రక్కల
దాకతీవియలల్లిప్రాఁకెనందు
నాచెంతముంగిటసలపులచేనిండి
సంపఁగితీవలుసొంపుమీఱె
నచటఁ బంచటమంగునంటి పందిరులపైఁ
జెలగు లేఁదీవ కెంజివురులొప్పె

గీ. సహహా! యీమేడకు వసంతుఁడనువు మీఱ
బువ్వు లలరించువాఁడుగాఁ బోలునింత
డవ్వునకె చూడవేడుక నివ్వటిల్లెఁ
జెంత కేఁగిన నెంతటి వింతయౌనొ. 6

క. ఉల్లము లలరం దావులఁ
జల్లుచు మలయానిలుండు సౌధము చెంతన్
మెల్లన మల్లడిఁ గొనియెం
జల్లని పూసురటివీచు చందమువాఁడై. 7

చ. పవనపుతాకునన్ స్తబకభారముచేతను నాటినాటికిం
జవజవలాడుతీవియల చక్కటి కేఁగుచు గండుతుమ్మెదల్
రవము లెసంగఁ బైఁబడఁ దలంకుచు నీఁచుక ఘోసరిల్లుచుం
గవియుచునుండె దుర్విటులకై వడి హర్మ్యముచెంతతోటలోన్.

శా. గండుంగోయిల పిండు రేఁగి పలుసింగారంపు పెన్గుప్పయిం
దుండెన్ మానవజన్మమెత్తితి నే ద్రోల్లాసముల్ మీఱు నా
రండీ! చెప్పినమాటఁ ద్రోసిచనినం బ్రాయంబు వ్యర్థంబగుం
జండీయంచును జూటుపోల్కెఁ బలుకుం జోద్యంబుగాఁ జెంగటన్.

క. కోకిల కాకలిపీసుల
సోఁకిన నల్లనఁ జరించు సోఁకుడు మేనం
బ్రాఁకినఁ బువ్వులతావుల్
దాఁకిన నటవిడచి పోవఁదర మేరికగున్. 10

ఉ. అందని నిల్వుటద్దముల యందము నారసివింతవారలీ
చందము గల్గునట్టి పలుసౌధములిందు నమర్చియుందురం
చుందలపోసి కొంతవడిఁజూచి యసంభవమంచు నెంచుచున్
సందియముం దొలంగవిడఁజాలు దురంతటి బుద్ధిగల్గినన్. 11

శా. ఆసోపాన పరంపరా విలసనంబాభిత్తికా చిత్రశో
భాసంపత్తియు నాగవాతిపటుశిల్ప ప్రౌఢియుంజూచి చే
బాసారా! భళిరే! యయారె యనుచుం బల్మాఱునగ్గించకే
పోసామర్థ్యముగల్గ దెంతసిరిచేఁ బొల్పొందు భూజానికిన్. 12

క. ఎంతటి జడదారియునా
చెంతకు నేతెంచి దానిసిరిఁ గాంచినచోఁ
గొంతవడి యోఁగకుండం
బంతంబొనరింపఁగాలు పై నెటుసాగున్. 13

గీ. దేవయానంబుఁబోలు నీదివ్యసౌధ
తలమునందెంత చక్కని తరుణిగలదొ
చూచి పోదమటంచును దోఁచకున్నె
యినుప కచ్చడములుగట్టు మునులకైన. 14

ఉ. చక్కనివారు లోకమునఁ జాలఁగనుందురుగాని వారి కొ
క్కొక్క కొఱంతగల్గును బయోరుహనేత్రి మచ్చమేనిపై
నెక్కొనుచాప్పునంగలదు నీరజసంభవు సృష్టికిట్టిలో
టక్కడికాంతకుం గొఱఁతయన్నదిలేదదిమాదుసృష్టియో. 15

క. కనకాంగి యనఁగనొప్పు
న్వనితారత్నంబు దాని వరగాత్రరుచిం
గనుఁగొనునంతనె యప్పే
రనభిహితంబయ్యె నెఱిఁగినట్టులఁ దోఁచున్. 16

ఉ. తమ్ములుపాణులాజ్ఞవరతమ్ములు చేప్పలు మేలితేఁటి మొ
త్తమ్ములు పెన్నెరుల్ సువితతమ్ములు గుబ్బలు భూరివజ్రభి
త్తమ్ములు దంతముల్ శశిహితమ్ములు చెక్కులనంగబాణపా
తమ్ములు చూపులుం గిరిహితమ్ములు నెన్నడలంబుజాక్షికిన్

సీ. తరుణుల నొప్పింపఁ దలఁచి మన్మథుఁ డాలి
వెడలించు చున్నట్టి యసిద మొక్కొ
మరల నంగముఁ దాల్చి మరుఁడు తుప్పవదల్పఁ
గోముచునున్న దోదుమ్మి యొక్కొ
పగదీర రుద్రునిపై నేయమదనుండు
చాయ లెక్కించెడు సాయ మొక్కొ
ప్రాఁగత్తులమరుండు పనిసాగమిఁ దలంచి
క్రొత్తగా జేయించు కత్తి యొక్కొ
గీ. యనఁగ నొప్పెడు బాల్యయౌవనము లొక్క
సత్తువను బోరు పోరిలో జవ్వనమున
కించుక జయాశ యధికమై యెసఁగునట్టి
ద్వాదశాబ్దవయస్సున దనరె నింతి. 18
చ. అరయఁగనోవియూరువుసుధాకరమోకరమోరమోన్నతిం
జరుగు ముఖంబు జవ్వనము సారసమారసమాసమానతా
సరసగళంబు మధ్యమును శంఖమనన్ ఖమనన్ మనందగున్
నిరుపమవేణి నెన్నడయు నీరదులన్ రదులన్ దులంగొనున్. 19
ఉ. పావడఁగట్టిసన్న వెలిపయ్యెదనిల్పఁగ దానిలోనఁ జెం
గావుల నీనుకైక యెసకమ్మును నూనెమెఱుంగు తళ్కులం
బ్రోవులు సేయుజాఱుముడినిఁ బొల్పగు క్రొమ్ముడి సొరుఁ జెప్ప న
ద్దేవుఁ డెఱుంగుఁగాక వెడలిపుల మాటలు పొల్లుపోవొకో.
సీ. సానఁబట్టెడు మరుశరము కైవడిఁ గొంత
క్రొవ్వాడి కన్నులఁ గ్రుమ్మరించ
ఈడ పండులకన్న నించుక హెచ్చుగా
గొనబారు పాలిండ్ల కొమరుమించ

ఇంచుక పండిన యిక్షుఖండమురీతి
నరతిపుగల్గు పల్కమరుచుండ
పూతకాఱొదవిన జాతివల్లికరీతిఁ
బాంగుచుండెడిమేని పొల్పులొప్ప
గీ. ప్రొద్దుప్రొద్దున హెచ్చెడు ముద్దులొలుక
లేఁతజవ్వన మొకవింత లీలసేయ
నేపగిదిసొరుగల్గునో రేపటికని
మానవులుజూడఁగా బాలసానియొప్పె. 21
ఉ. తమ్మికిరంగువేయఁగనెడం దలపోయుట మేల్మిబంగరుం
బొమ్మనుసీటిచేఁగడుగ బుద్ధిజనించు టనర్ఘమైన ర
త్నమ్మునుదీపసన్నిధిఁ గనం దలపోయుటగాదెసత్య మ
క్కొమ్మకుభూషణమ్ములను గూర్పఁదలంపుదయించుటెంచగన్.
చ. వెలివలిపెంపువల్వపయివెల్వడిశారదనీరదంబుపై
దళుకులెసంగుమించులవిధంబుననొప్పుచునిండుపండువె
న్నెలనలరారుహొన్నకరణిందగునచ్చెలిమేనికాంతులం
గలయఁగఁజూడమేనఁబులకల్జనియింపనిధీరుఁడుండునే 23
సీ. చేమంతిపూదండసిగఁజుట్టుకొనియుండఁ
జక్కఁగానలరించునొక్కనాడు
గేదంగిరేకులుగీలించియొక్కనాఁ
డల్లిబిల్లిగజడనల్లుకొనును
మల్లెపూదండలు జల్లియు నమరించి
యొప్పుగా నొకనాఁడు కొప్పువెట్టు
గొజ్జంగపూవులు కొనురొప్ప నమరించి
యొకనాఁడు జాఱుముడి యొప్పదిద్దు

గీ. దినము నాకయింతి యిందుఁడు ననుచుఁజూచు
వారికిఁ దోఁచుచుండ నబ్బాలసాని
రమ్యహర్మ్యాంగణపుదువారమ్ము చెంతఁ
గొంతసే పొకవింతగాఁ గూరుచుండు. 24

ఉ. గాగరయొండుగట్టియిదిగాదని వేఱొకరంగు పావడం
బాగుగఁ బూని యాతరముపయ్యెదకుందగదంచు నొండుమేల్
గాగరఁ బూని యందు మదిగ్గక చీరలుబూనసాగునా
బోగముచాన వేళకొక పొల్పువహించును జిత్రభంగిగాన్. 25

సీ. తెల్లిము త్రియపుచాయ తేట వెన్నెలగాయ
గుమ్మటీల్ పీనుల గనియుచుండఁ
డత్రిఁబెట్టి బాహుల దండకడెంబులు
పాలిండ్లరాపిడిఁ బరపుచుండ
సరజాలు పైఁటలో వరుసఁ గానఁగవచ్చు
మేలికాసులసేరు దూలుచుండ
నిరిసిన నడుమున నించుక తళతళ
మెఱయు నొడ్డాణంబు మెఱపులీన

గీ. సరులబంతులుకంఠ దేశంబునెనక
మేలిపువ్వులకైక పైఁ దూలియూఁగఁ
గెంపుటుంగరములు వ్రేళ్ళ నింపుఁగులుక
మదన మోహనలక్ష్మి నా సుదతియొప్పె. 26

శా. సద్యోమంజితశీర్షగండచుబుకశ్మశ్రుండుగోపాదమా
త్రద్యోతంబగు పిల్లజుట్టుమడతందై వారునీరాకవియున్
విద్యుచ్చంచలదృష్టులుంబ్రతిపదావిర్భూతదుస్సాహితీ
విద్యాగర్వముఁగల్గుజానపదుఁడౌవిప్రుండొకండేపునన్. 27

ఉ. సొరగుబిళ్ళకచ్చఁబలుచక్కఁగమాటుచుమాటిమాటికిన్
మోరులుగట్టుచేతులుగనుంగొనసేవజనింపనొక్కనాఁ
డారజమొప్పనట్టికనకాంగిమనోహరగీతముల్ వినం
గోరికగల్గినేఁడుమనకున్ సుదినంబనియాత్మ నెన్నుచున్. 28

క. అరూపాజీవ వరా
గారము తెఱవ్రున నెమ్మొల్లగాముసిముసిన
వ్వారఁగఁజీటికిమాటికిఁ
దీరుగహస్తద్వయంబుఁద్రిప్పుచునచ్చెన్. 29

గీ. వచ్చునంతటఁదద్గృహద్వారపార్శ్వ
వేదికనొరంగియున్న యవ్వేశ్యమాత
పాపయచునదిచెంగటిబాపనిఁగని
తనమనంబుననిట్లనితలఁచుకొనియె. 30

క. ఈబోడిబాపనికిమా
పూఁబోఁడినిజూడవేడ్క బుట్టినదేమో
సేబాసుదొఱకెనేటికి
నాబాసలమెలఁగువెడఁగునరుఁడనిమతియున్. 31

శా. ఏమీయాతఁడుఁడుసానినాడకడఁదానేమేమొకోపద్దెముల్
మోముల్ వెల్వడనీకలోగొణుకుచున్ముద్దొల్కఁగావచ్చెనో
రామందస్మితసుందరాననమునోయ్యారంబులయ్యారెకా
నీమాటాడిమనస్థితింతెలిసెదన్నిక్కంబటంచిట్లనెన్. 32

ఉ. ఎందలివారుమీరు కుల మెయ్యది మీదగునామమేమి మీ
కిందరుదేరఁగజ్జమదియేమి మహీసురులంచుఁదోఁచెడిన్
వందనమయ్యయెన్నఁడిటువచ్చినవారలుగారు నేఁడుమా
యందుదయించెనే మొకొ దయారసమంచుఛలోక్తిఁబల్కినన్

గీ. అధికసౌభాగ్యమస్తు దీర్ఘాయురస్తు
ధర్మరతిరస్తనుచుఁ బల్కఁడమునునాకు
దీనసయోగంగనేల నీ త్రితయమందు
నొందునసహజమెకర్త్వాతరెండు గల్గె. 34

వ. అనినందదర్థావగతియందు నర్థింపఁ దన సామర్థ్యంబునకుం
దగిన నెత్తిసమర్థంబున నవ్వికొనుచుం దిరిగిరిగి చూచుచు
మందమంద భాషణంబుల నాజరతికిట్లనియె. 35

మ. ననునారాయణశాస్త్రియందురిచటన్సర్వోర్బిలు సత్సాహితీ
ఘనసైపుణ్యముగల్గువారలును నేఁగానంబునందింతనే
ర్చినవాఁడం బలునాళ్ళనుండి మనినుజ్జృంభించుచుండెంగదా
కనకాంగీపరిగానసూభురెంగిసంగీతాహలంబెంతయున్. 36

గీ. ఎవరుచెప్పినఁ బాటయందింతనిపుణ
తేజనుచుఁ జెప్పుచుండుట మోవమొదవె
లలననీకెట్టిపసుగానలయు
నామమెవ్వదిచెప్పు మనంగనదియు. 37

గీ. చిట్టిపాప యటంచ్రు మనన్ పన్ననాఁడు
నాకుఁ గూతురు కనకాంగి నాయదృష్ట
మేమనఁగవచ్చు మీరు నన్ యింతిఁజూడ
వచ్చితిరి లోనవిచ్చేయవచ్చుఁ గదుఁడు. 38

క. మీరే వారో వేత్తే
నారాయణశాస్త్రిగారి సంగీతకో-
గారవమున రత్నమునకు
నాహ్లాదింగ అప్పుచుందు రతినయమనిరన్. 39

క. ఆహా! నేనేయిఁక సం
దేహింపన్వలవదనుచుఁ దెలుప జరతి యో
హాహా దయచేయుండని
గేహమునకుఁ దోడితెచ్చి కృత్రిమ భక్తిన్. 40

ఉ. గద్దియఁ దెచ్చియిచ్చి కనకంబిదె కన్గొనుఁ డంచు వేగస
మ్మద్దియఁ దెచ్చి యాతనికి మ్రొక్కఁగఁ జేయుచు నయ్యమాకు నే
ప్రొద్దును మీతలంపె కద పోషిమి మీకడ నీ సానికిన్
విద్దెయొకింత నేర్పుకొన వేఁడఁగఁ గల్గెనటన్న నాతఁడున్. 41

సీ. తమ్మిఁ గిమ్మన పాఁటి నెమ్మినమ్మిన వేణి
కమ్మఁ గ్రమ్మిన శ్రోణిఁ గల్గుదాని
వలపులీనెడు తేట మొలపులానెడుమాట
సొలపుఁ బూనెడు పాట సొంపుదాని
నిరులసొంపగు మేను హరుల పెంపగు కొను
సిరులనింపగు వీను చెల్వుదాని
మంథరంబగు నడ సింధురంబగు తొడ
బంధురంబగు మెడ బఱఁగుదాని
గీ. మాటిమాటికి నొకచేటి వీటివేటి
దీటి తనగోటి కోటిని వీటిమీటి
సూటిగా నోటికిడుచుండ ఘోటితోటి
సాటియగుబోటి మిన్నవఘూటిఁ జూచె. 42
వ. మఱియుం బాపయిట్లనియె. 43
క. రత్నము సకుమారుదయన్
నూత్నములగు శ్లోకములు మనోహరలీలన్

యత్నంబునఁ జెప్పంగన
యత్నంబగుఖ్యాతిఁ గనెనందతిలోసన్. 44

క. మీవయకుఁ బాత్రురాలిది
గాదో యీయల్పురాలు ఘనవిద్యలకుం
బాదియుఁగాఁదగదో మీ
రాదరమునఁ జూడకున్న నాదరువెవరో. 45

శా. అయ్యావమాకును మేళమేతలఁప మేలైనట్టియాధారమా
వెయ్యార్యుల్ సమకూరినన్ విశివడన్ వేసానివృత్తింగడుం
జెయ్యంజాలము వారివీరివలెనేఁ జెప్పంగఁ గైవారమా
సయ్యాటంబులుగాపుసుంతువినుఁడీ సత్యంబు మీతోడుగన్. 46

క. సంగీతంబన మీకన
కాంగియొ చెవిఁ గోసుకొన్ను నల్లరిపనులం
బొంగదు తనసరివెచ్చపు
టుంగనలెంతెంత సొమ్ము లార్జించిరొకో. 47

ఉ. మీదయ చేతవీణియను మీటును నేర్పన గాత్రమింపుగా
సాదనఁ జేసి పాడుమటన్నా స్త్రివిధిన్ భరతంబుఁ జూపునోం
ఛేదిక్కా అంత లేదభినయించుఁ దెనుంగున నెన్ని యెన్నియో
రాదొకసంస్కృతాభినయరక్తి మమీకృపఁ బూర్తిగావలెన్.

సీ. తనకుఁ దహాస్సీలుదారుగారొకనాఁడు
పట్టుచీరలనంపఁ గొట్టివేసె
మొన్న డ్రస్సరుగారు గన్నెరువిరులనఁ
గాసులనంపినఁ ద్రోసివైచె
నేలక్రిందట జవాబునీసుగారును జరీ
బట్టలంపించిన ముట్టదయ్యె

నేఁడునునొకయింజనీరుబంపించిన
బ్యాంకునోటులుచేతఁబట్టదయ్యె
గీ. నింతమఘరాపురంబులోనెంచిచూడఁ
దానొకతెయేమొలేదొకో సానులింక
నీబిగియొకింతదప్పఁ దన్నెవఁడుచూచు
నిపుడునాకొకప్పైసనిచ్చునెవఁడు. 49
క. నీటునుగోటునుగలదని
వాటముగానున్నదనుచువలఁతురుమజిమిం
బోటులువెలబోటులుపడి
కోటులునార్జింపకుంద్రొకో పెరవారల్. 50
క. కనకా! వీణారావము
వినిపించుము మేడపైకపేక్షావేగం
గొనిపోయియనఁగనట్లనె
యొనరింపందొడఁగెనదియునుత్సాహమునన్. 51
ఉ. పందిరిమంచపుంబరుపు పైని సెలాడలుదాపులొప్పఁగాఁ
బొందుగనున్నవీణెనలబోగముచానలమిన్నమెల్లనం
గ్రిందికిఁవేళ్లుదోమతెరఁగేలనొకింతదొలంగఁద్రోచితె
చ్చెందనుగాంచిబాళిహెచ్చఁడుచిత్తమునందడబాటునొందఁగన్.
గీ. ఒకతివాసిపయింగూరుచుండి వీణ
గవిసెనలనొత్తిగించి చొక్కటంపుబిరడ
లొప్పుగాఁద్రిప్పి గుబ్బలనొనరఁజేర్చి
శ్రుతులుసరిచేసిపాడంగఁ జొచ్చెనపుడు. 52
ఉ. తానగతుల్బరస్ఫురముదారొకఁనరాగము సంకరస్థితిం
బూనక రంజిలంగ స్వరముల్గ్రమమై ఖరినుండఁ బల్లవు

త్రేలయులోల్కఁగల్పనలఁ దేజరిలంగ విపంచిపైఁ జెన
చ్చాన నవస్థితిన్ రసముజల్లులు జల్లుచు జల్లుజల్లుగన్. 54

ఉ. పాణితలంబుచేతముడువంగను పేక్షజనింపలెస్సగా
మీఁటియమీటు సంపడినిమీడుచుమీపున వ్రేలుచున్నయ
వ్వేణికివాతపోతములుమీచుటనించుకదిత్తాఁగు కంఠల
శ్రేణికిఁ గల్గుబల్మోసబగుఁజెప్పను శేషుఁడుమాఉప్పుట్టునన్

చ. తళతళలాడుచుంజెవులఁదార్కొనుపంజులకమ్మరత్నకం
దళరుచి వీణమీటుచలనంబున మోమునఁజెంగలించుచు
న్నలఁగొనుచుంబరస్వరమమంగతింద రిత్రోపులాడుచుం
జెలఁగఁగజెల్వుమీరుచెలిచెంగటనిల్చుట యెంతభాగ్యమో

శా. ఆలావణ్యవతీలలామ మృదువీణాలాపమున్ నైజ కం
ఠాలాపంబున మేళగించిపలుకన్ వ్యక్తంబుగా కేకమై
యాలింపంబడఁ జత్తమ్ములఱఁగుచున్ హాయింబరాచుత్తము
ల్గాలేకున్న నెరుంగనోఁగద సతీలావణ్యలీలాగతుల్. 57

మ. పొలుపుంగుబ్బలుగుబ్బకాయకుఁగిరాపుంజేయఁగామాటికిం
దొలఁగందన్నుచొకింత రక్తిమము పైఁతోఁచంగ వేమారు ను
బ్బొలయన్నిక్కుచుమిట్టిమిట్టిపడుచు న్నమ్మించుఁబై చీరయు
న్వొలలన్ సందడిఁజేయసవ్వొలవెలందింజూడ నెట్లుండునో.

క. బాగముసాని మొగంబున
రాగమ్ముదయింపబిగ్గరంబాడఁగఁబై
పైగళమునుబ్బుచునా
డగణమొప్పారువింతకీవి నలరుచున్. 5ᒧ

గీ. పార్వతీనాథ! విను నారభామమేను
సాఁగఁగా వీణ వాయించు సౌరుదోఁచె

దలఁచుకొనియయ్యమీకిని దాసురాలు
గాఁగ దలపోసి విద్యనుగఱపవలయు. 68

ఆ. అనిన వెఱ్ఱికుఱ్ఱ కుఱుమావి నొలికిన
కరణి నెల్లపనులఁ గట్టిపెట్టి
యున్న తెలివిఁ బోపఁగొన్ని శ్లోకంబులు
చెప్పఁదొడఁగె దినము దప్పకుండ. 69

ఉ. ఆతఁడు చెప్పు శ్లోకములు నచ్చటనచ్చట నుచ్చరించుచో
నాతరుణీలలామ పరువంపుఁ బ్రాయముఁ బోవఁదొడంగుచుండఁగా
నాతని విద్యపెంపుఁ దెలియంబఱె వీఁడెడకాఁడుగా విట
వ్రాతములైనఁ దెచ్చువిడువం ద్వారయేమియటంచు నెమ్మదిన్.

చ. పరిచయ మెక్కుడై కొలఁది వారవధూమణి నాఁడు నాఁటఁ భూ
సురుని నలక్ష్యపెట్టి యెకసెక్కపుమాటల వెళ్ళఁబుచ్చుచున్
శిరసున నొప్పియంచు మదిచీఁదఱపోందెనటంచు బద్ధకం
బారసెనటంచు నేడు చదువొల్లనటంచును బుచ్చెఁ గాలముల్.

సీ. అలవడునవ్వి పరిచయం బధికమైన
నెంతవారికినైనను నెచటనైన
నందు మగువలు పైవెలసుందరులటు
పై మిగుల ఛాందసుని బుంగఁ బరపుటరుదె. 72

శా. వేళాకోళములోన దింపి కతనిన్ వేశ్యామణుల్ శ్లోకముల్
మూలంబట్టిను శాస్త్రిగారటఁ యయిక్ లోకాభిరామాయణం
బాలంబించిరి చిట్టిపాపయును మాయమ్మాయి కవ్వేటికా
నాలోచించుఁడి యర్థ మెవ్వఁడగు మీరాన్యుల్ గదా డీనికిన్.

సీ. అనియడుగ నాతఁడదియును దనకు గొప్ప
గౌరవంబని తలఁచుచు వారిగూర్చి

విలుకనైయాడనేమని చెప్పవచ్చు
వేశ్యసామాన్యయను బిల్లవెఱ్ఱితనము. 74

ఉ. వారలుశాస్త్రిగారిపనిఁబట్టకయుందురెబీదబాఁపఁడం
చారసియీవెడంగుమనకర్థమొసంగెడునంతవాఁడె యం
చూరకయుండిరాతఁడునునొంటరిగాఁగనకాంగిపారముల్
నేరుచువేళఁజేపడును నేటనొరేపొయటంచు నూరుచున్. 75

చ. తనమదిబైటఁబెట్టునెడఁదప్పదువీఁడవివేకియందురో
యనుకొనికాలముంగడపునంతటపాపయు డగ్గరిల్లి నే
మనవియొనర్తునయ్యవెడమాటయొకించుకవిత్తగింపుఁడీ
మనమునఁగోపముంచకుఁడుమాకువివేకముదుర్లభంబుగా.

వ. అది యొద్దియవిన మన కనకాంగికిం గన్నెఱికంబాదిగాఁ బురుషుని యొడలంటుట యాకసంప్రవిరిదుటముట యన్యో న్యట్లూరకుంట నాకుచితంబుగాదు. మీరుం దంప్రతింబోలు వారు గావున నిబ్బాలికకుం దగిన యొక్క ధనవంతుఁడును రూపవంతుఁడునగు తరుణు నొనఁగూర్పుఁడన దీనికింతదూరం బు దరుమవలెనె యిక్కార్యంబు నాయదియకాదె చెప్పెద నాకర్ణింపుము. 77

చ. కలఁడు వివేకరావొకఁడు గట్టి పరీక్షలనిచ్చి తేరి మి
క్కిలియును గొప్పలాపవలఁ గీర్తివహించినవాఁడురూపముం
గలిగినవాఁడు నేర్పరియుఁ గాని యకంఠఁటకట్టుఁగట్టి వే
శ్యలసరయంగఁ గూడదను సంఘములోపల నున్నవాఁడవన్.

శా. ఒసోయెంతటివెఱ్ఱిబ్రాహ్మణుఁడవయ్యావీరువేసాల్గల
సాహంకారముగాఁ బవల్ మిగుల బాసల్ వట్టి దీపాలతో

నీహాల్ వృత్తి మునుంగువెట్టుకొని మాయింట్లో సోదించి సం
దేహంబంచు నొక్క చెడ్డగుడిసె న్నిశ్శంకులై తూఱరే. 79

మ. అలయూనాయఁడుగారు మొన్నటిదినంబాక్లబ్బుమీటింగులో
వెలయాంధ్రంగన రాదటంచు నిగులన్ వేమాఱువాదించియా
పలుకుల్ వెంటనె బుట్టదాఖలుగ నాపైరాత్రి మాయింటికిం
గులుకన్ వచ్చిరి మాఱుత్రోవలనెలుంగున్మార్చి మాటాడుచున్. 81

వ. అట్లువచ్చినంజూచి నే నిట్లంటి.

క. ఆటచెలిఁ జూడ వలదని
మీటింగునఁ జాటితిరఁట మీరగుదురొ మీ
జోటి యొకరొ యిది వేశ్యా
వాటముగాదొ యిది వారవనితయుఁ గాదో. 82

క. నా నతఁడిట్లను నించుక
నానం దలవంచి యట్లు నలుగురితోడం
బూని పలుకంగవలెఁ గా
కానుడువే నిశ్చయంబె యనె విను మఱియున్. 83

ఉ. మేమొక పెండ్లిలోఁగిటను మేళము సేయుచునుండఁజక్కఁగాఁ
దాము వచ్చి చూడకటఁ దారుచు నీతెగవారు కొందఱా
గీముల సందులందుఁ గిటికీలకడం గడులందుఁ బంచలన్
లేమల చెంగట న్నిలచి నిన్నుఁగనుంగొన సాఁగిరేమనన్. 84

ఉ. వీరలలో నొకయ్య పసవిం గనకాంగినిఁ జూచి వేడుకల్
దేరఁగ మాటలాడుచును దిగ్గున నొక్కఁడువచ్చి నీవు నీ
తీరగునయ్య క్రేయ సుదతీమణితో సరసోక్తులన్న సం
సారిణి యంచుఁ బల్కితి నిజంబనుచున్ వెడగుత్తరంబిడన్. 85

ఉ. కావున నాయెఱుంగనిది గాపుగదా యివి యిట్టి నిష్ఠురో
ఛావము లిట్టిబూటకపు పల్కులు పండుదు నిర్వహించుచుఁగా
కే విధినైన సంభూషణంబ కింతులు దారసమైన నూరకే
పోవఁగనిత్తురే పలుకు పొల్లగుఁజుమ్మ మహీసురోత్తమా.

మ. అన నాశాస్త్రి నచించె సాఁగవిఁకనీయాటల్ వివేకాఖ్యచెం
తను నేనాతనిఁ బెక్కుసారు లొక బోల్తాఁబెట్ట నూహించి యా
పని సాగింపఁగఁ జాలనైతినిగదా! పైపెచ్చు మీయింట్లకు
న్నను బోవద్దని మాటిమాటికిని ఘూన్ప నృత్నముం జేసెఁగా

గీ. నీదు యుక్తులు గొప్పనై నెగడుచుండు
నీతలను నించు నాతని నీతిపల్కు
లింత యేటికి మగవార లంతకఱవె
వేఱొకని నుగ్రహింపుమ వినుము వాని. 88

ఆ. నేను కృష్ణమూర్తి పెండ్లిపెట్టి లేనయుండు
రెండు మూఁడు లక్ష లుండు ధనము
వాని తండ్రి నాల్గువారమ్ములకు ముందు
సమసె నంచు వింటి సత్యముగను. 89

వ. అనినం బావ యిట్లనియె. 90

శా. అన్నా యెంతటిమాట యంటివిగదయ్యా, నాదె సుమ్మిట్టిత
ప్పిన్నాళ్ళుం గనుచుంటి రొక్క మగవాఁ డీయింటికి న్వచ్చునే
యెన్నం జాకలి మంగలిం దురక దూదేకుం గడం గూర్చఁగా
నున్నారో కులగోత్రహీనలని మీ రూహింతురే వేశ్యలన్. 91

క. ఏలూరు పురనివాసా
బాలేందు కృతావతంస పాలితదోషా

పాలిత మార్కండేయా
యాలీలం బాప వల్కె నవ్విప్రుండుక్. 92

సీ. తప్పు/నర్కితి ననుచును దలఁచి నాల్కఁ
గొఱికికొని పాప దీనికిఁ గోపమేల
యెంచికొని చూడకుందురె మంచిచెడ్డ
లింత మాత్రమునకెకదా యింతదప్పు. 93

క. నీకూఁతురె నాకూఁతురు
గాకుండునె యదియు నొక్క ఘనుఁడగు వానిం
జేకొన్న ముదముగాదే
నీకొకతెక దాని బరువు నేనెఱుఁగనొకో. 94

వ. అనుటయుం బాప యిట్లనియె.

ఉ. మొన్నఁ బ్రభాతవేళ యొకముచ్చటకై సెలవిచ్చి యుంటిరే
యి న్నగరంబునందుఁగల రెన్నికఁ బొందుచు రామదాసుగా
రన్నర ముఖ్యు నందనుఁడు యౌవన శాలి విలాసియంచు నా
చిన్ని కుమారు వర్తనముఁజెప్పుఁడు తెల్లముగాఁగ నాపుఁడున్

శా. ఓ నా నాకుఁ బరాకువచ్చెఁగద నీకాంతము చిత్తంబునం
దేనాఁడో వినియుంటినీసన్ మరపురాఁడే భామినుల్ ధీమతుల్
వానిం జెప్పెదఁ జక్కగా వినుము నాభావంబునం దెంచఁగా
నీ నారీమణి కాతఁడే తగుఁగదా యెన్నెన్ని యంశంబులన్ 97

ఉ. నీవు నెఱింగి యుండువౌకొ నిండు బజారున దూర్పురోడ్డుపై
దేవుని యాలయంబుకడ దెల్లగ నుండెడు పెద్దమేడపై

సావడి రామపీఠమును జక్కని భక్తిని రామదాసు పూ
జావిధు లుత్సవంబులును సల్పుచునుండును నిచ్చచ్చలున్ 98

చ. అతని సుతుండురూపున సుమాస్త్రిఁడుజన్నతనంబువాఁడు మి
త్రతతకనుకూలుఁడుంజారవధైర్యముస్వేచ్ఛయుఁగల్గువాఁడు త
త్సతి యొకపాటిగాని పలుచక్కని కోమలిగాదు దానిపై
హితమతి నున్నవాఁడునలె నిప్పటికిం గనవచ్చెడుంజుమీ. 99

క. ఏటేటం బదివేలుగఁ
గాటకమున వచ్చెడు న్మొఖాసలవలన్
నాటకములు సంగీతపు
పాటలు మేళములు నతని ప్రాణముసుమీ. 100

గీ. ఇచ్చె నింగ్లీషులోనఁ బరీక్షయొకటి
రెండో యాతనికుద్యోగ మొండదేల
నట్టి కేశవరా వింతి కర్హుఁడనుచుఁ
దోఁచుచుండెను నీకెటు దోఁచునొక్కొ. 101

క. అయ్యా ! శాస్త్రిలుగారూ !
చయ్యన మీరచటకేగి సానిపయిని నా
యయ్యకు మీపలుకులచే
నెయ్యముఁ బుట్టింపవలయు నేర్పున ననిన్. 102

మ. అతిమిత్రత్వము నాకు లేదతనితో నైన న్మదీయోరు వా
క్చతురత్వంబున వానిలోఁబరచెదన్ శాస్త్రింబులం జూచు పం
డితుఁడ న్నాకిది యెంతకార్య మిదె వానిం గోతిలోఁ ద్రోతుఁ ద
త్పిత మిత్రుం డతఁడిచ్చెఁ బండుగకు నీతీగంచుపుట్టంబులన్.

మ. ఇల నారాయణశాస్త్రిగారనుచు నన్నీపేరటం బిల్వఁగా
వలదీ కార్యముఁ జేయలేనియెడ నేఁ బంతంబుఁగావింతుఁ దో
య్యలికిం గేశవరావుఁ గూర్తు నన రూపాజీవ మీకారయం
గొలఁది నీమెచ్చిన కార్యముండదని నాకున్నిశ్చయంబేసుఁడీ. 104

గీ. అయ్య మీవలెఁ గనకాంగి యధికభోగ
లంపటయెకాదు మాకుఁ దలంపనిదియె
వృత్తిగద యందుఁజక్కఁగా వెదకి పేరు
గల్గువానినిఁ గూడుట ఘనతమాకు. 105

క. వారి స్వీరి న్వలె నె
వ్వారగపడిరేని వారిఁ బలచుట మాకుం
గౌరవమె మాలేరంబుసఁ
జేకొండని వారి, బొందు సెలదుఁలుగలరే ? 106

మ. అటు పల్కన్విని బ్రాహ్మణుండనియెఁ బాపా! సంజకెంజాయమిం
న్నటుపర్వె న్మనయింతప్రొద్దును ప్రసంగాసక్తిఁ జేసుంట నిం
తటిలో సూర్యుఁడు పర్వువెట్టినక్రియం దానస్తశైలంబు చెం
గటికేగెంగద కాలమల్పమనుచుం గాన్పించుఁగారాత్రి చేర్.

ఉ. సారసముల్ ముడుంగుతఱిఁ జక్కఁగ మేను లలంకరించి సిం
గారము మీఱు పువ్వులు నిగారపు కొప్పులఁ దాపులీసఁగా
వారవధూమణుల్ దమ దువారముచెంగటఁ గూరుచుండి ర
ప్పారవిటుల్ దమిన్వెడఁగు పాటలుబాడుచు వచ్చిచూడఁగన్.

సీ. ప్రొద్దుపోయిన దంచుఁ బాలతుకయొక్కతె
చిడుముడిపాటుతోఁ జీరఁగట్టెఁ

గుదరదీవేళ నీకొప్పు నాకనుచును.
దడదడ నొకరీతి ముడిచెనొకతె
విటులు వత్తురటంచు వీథిగుమ్మముచెంతఁ
దొంపరగాఁ దలదువ్వె నొకతె
తొలినాఁటి దుప్పటి దొలఁగించి చఱచఱఁ
బరపునఁ దెలివల్వఁ బరచెనొకతె
గీ. చదివె విటుచేటి దీపంబుసరస నొకతె
యొలికై బేరమాఁడుచునుండె నొకతె
విటుని విసోక్తి నొక్కతె వెడలఁద్రోలె
నొకతె బొజుఁగును గనుసైఁగ నొప్పుకొనియె. 109
క. ఇందలి దీపాంకురములుఁ
బొందునకై వచ్చునట్టి బొజుఁగులఁ జూడం
గ్రందుకొను పణ్యవనితల
సుందర నేత్రములు నొక్క సొబగున నొప్పెన్. 110
ఆ. పవలు దెఱచినట్టి బజారుపదార్థములమ్మ
నంగడులను మూసి రత్తరువులు
విరులు విడియములును సరస వస్తువు లమ్మ
నంగడులను దెరచి రతిన వీఁట. 111
సీ. పగలెల్ల నొకరీతిఁ బట్టిన మగువల
మగల మనంబులు దెగువఁజేసె
వారకాంతలఁ జూడవలదను వారికి
దిడ్డిగంతలును హైరోడ్డులయ్యె
ఘనవర్షముల విట ఘనములు వర్షింప
వెలపొలంతుల యిండ్లు తొలుకరించెఁ

బలుజాడలఁ జరించు తులువల కెల్లను
పాడు కొంపయె దివ్య భవనమయ్యె
గీ. అవని మీఁదను దీపంబు లలమినట్లు
ఘన పథంబునఁ దారకల్ గ్రమ్ముకొనియె
మదుఁగులఁ బఱోరుహంబులు ముడిఁగినట్లు
మానవులకును గన్నులు మాటుపడియె. 112
క. మరుఁడును నాతనితోఁ ద
త్పరివారముఁ దత్క్రియానిబద్ధాత్ములుఁ ద
త్పరితాపితులును దక్కం
బరులం గ్రమ్ముకొనె నిద్ర పటుతర తమముల్. 113
ఉ. రాతిరి చాలయయ్యె ద్విజరాజుదయించెడు వేళయయ్యెడుం
జేతన సంఘమారవముఁ జేయుటమానెను పోయివచ్చెదల్
నాతిరో ! యంచుఁ జెప్పి తన నట్టునకుం జనె వృద్ధవేశ్యయుం
గూఁతురితోడభోజనముఁ గూర్మినొనర్చిపరుండెనయ్యెడల్.
క. ముని మానసైకశరణా
వనరుహ శరధారి గర్వ వైభవహరణా
ధననాథ సఖ్యకరణా
ఘనకరుణా భరణ చంద్రఖండా భరణా. 115

మాలినీవృత్తము.

హిమవదచలపుత్రీ ప్రేక్షణాంచ ద్విలాస
క్రమపరవశలోల ద్గాఢ చేతో మిళిందా
యమర మకుటరత్న ప్రాప్త పాదారవిందా
స్తిమిత సుగుణబృందా తీక్ష్ణబాణాన్మకుందా. 116

గద్యము.

ఇది శ్రీమన్మంత్రిప్రగడ వంశపయఃపారావార రాకాసుధాకర
రాజబిరుదాంకిత భుజంగరాయామాత్యపౌత్ర హరితసగోత్ర
పవిత్ర దుర్గామల్లికార్జునప్రసాదరాయవరపుత్త్రి శ్రీమా
ర్కండేయ వరప్రసాదజనిత కవితాధౌరేయ బుధ
జనవిధేయ భుజంగరాయనామధేయ ప్రణీతం
బైన వారకాంతయను చాటుప్రబంధంబు
నందుఁ బ్రథమవిలాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

శ్రీ మార్కండేయస్వామినే నమః.

# వా ర కాం త.

---

## ద్వి తీ య వి లా స ము.

క. శ్రీమార్కండేయేశ్వర
సామజముఖ షణ్ముఖ ప్రసాధిత సక్తా
హైమవతీ రమణీ ప్రియ
సోమసిత విభాసమాన సుందరగాత్రా. 1

క. అవధారు దేవ పైకథ
నవిరళగతి లోకమెల్ల నలమిన తారా
ధవ ధవళిమ వెలవెలయై
పవలా లోకమున కనుచుఁ బలుచం బడియెన్. 2

చ. ఒకనికిఁ బై నొకం డధికుఁ డుండిన నారసి చూడ వానిపై
నొకఁ డొదవుం దమం బలమియుండఁగ వెన్నెల దానిఁ ద్రొక్కుచుం
జకచకగా వెలింగె గద చయ్యన దానిని మాపు మాపుచుం
బ్రకటగతిం జరించుటకు భానుని నెల్గుడయించెఁ దూర్పునన్.

చ. ఇఁక నొకసారి ముద్దిడు మఱింకొకమాటు కవుంగిలించు మిం
కొకపరి మోవియిమ్ము మఱియొక్కపరిం గవగూడుమంచు నా
యకులు బలాత్కరింప సతులల్లదె పో తెలవాఱె నింక రా
దొకొ నిశయంచు సందులకు నొప్పఁ దొడంగి రొకింత నవ్వుచున్.

ఉ. ఆసగతిం జరింప నొకఁడల్లనఁ దారుచుఁ బోవు వేళలం
డాశలు నాల్గుఁజూచు నొకఁడచ్చట డాఁగు నొకండు భీతిచే
లేశము సందియంబుసఁగ లేక యథేచ్ఛను బోయె నొక్కఁడ
వ్వేశము పేశిపోవు విట పీరులునగ్గడ సట్టివేసుల౯. 5

క. అలరువిలుకాని పోరుల
యలయిక నిదురించు చెలుల సత్రాటి సత్రోల్
కలయండలెక్కఁ నిద్రకుఁ
గోలనిల లేవేయుటంచు గోసగికి యుల్కఁ౯. 6

శా. ఆనారాయణశాస్త్రివేగ సముద్యమ్వ్యాపారముల్ దీక్ష్ణ లో
లో నిట్లించుఁ దలంచు వారవనితల్ దోరంపు నెయ్యంబున౯
నేనే దొడ్డని చెప్పినందుకిఁక దీనిం జేయులేకుంజిన౯
నా నైపుణ్యము వాల్పనే జనముల౯ వ్యర్థంబు గాకుండు నే.

ఉ. ఆ కినకాంగిఁజూచుటకునై పసియుండు రసకు లట్టిపో
నాకవలీలగా దొరకె నాఁడు సభం బలుమందియుండఁగా
నాకిడెఁ జాన వందనము నాకిది చాలదె కని చేతనే
నాకోసఁగూడెఁ బేరెచట నన్నొకఁడేనియు మున్నెఱుంగునే.

గీ. అరయ మేను పరోపకారార్థముగద
వీరి కుపకారమొనరించు దారిదొరకె
నేఁడనుచు బీరమును గాంచు నెపము పెట్టి
యతఁడు కేశవరావు గేహమున కరిగి. 9

సీ. ఒక మొగ్గర నవగంధ వికసిత సంతాన
సంతాన ముఖపుష్ప సముదయంబు
నొకవంక సత్పాత్ర యోజిత శ్రీఫల
శ్రీఫలపత్ర విచిత్రరచన

యొకచెంత దేవార్చనోద్యుక్త సద్భక్త
సద్భక్త ముఖ్య ప్రసాదగరిమ
యొకచోట గీతికా ప్రకటన యుక్తాల
యుక్తాలసేతర భక్తజనులు
గీ. సుప్రసిద్ధ తరాష్టపదీ ప్రవీణ
ధీప్రవీణులు నొకయెడఁ దేజరిల్లు
రామదాసాఖ్య దర్శించు రామపీఠ
సన్నిధికి నల్ల నల్లన జరిగి యతఁడు. 10
శా. మీ పీఠం బరయంగ వేఁడుకపడిం బ్రేరేచఁగా నేటికిన్
నాపుణ్యంబు ఫలించెనంచు ననుమోదంబుల్కుచున్ రామదా
సోపాసీత సుమంబులందుకొని యందున్నట్టి తత్పూనునిం
దాపై కూర్చునియుండె జన్మమునకుం దాపైన మందుండనన్
గీ. అహాహా! కేశవరావుగా రాప్తులయ్యు
దర్శనంబునొసంగరు తమరు గ్రామ
మందు లేరొకొ యీమధ్యమందు మీకు
సేమమే మిమ్ముఁగాంచితి జక్షేమలరె. 12
ఉ. సేమము మాకు నీదు దయచే ద్విజశేఖర నాల్గురోజులే
గ్రామమునందు లేను మిముఁగాంతును నేనపుడప్పుడిక్కడే
తాము వసించియుందురొకొ తద్దయువచ్చుచుబోవుచుందునిం
వేమిటికిట్లు వత్తురది యేమన నక్కనకాంగి విద్యకై. 13
ఉ. అంతప్రయాసమేల తమకయ్యెయొ నేనొకనాఁడురానిచో
నెంతయొ జేతురిప్పునికె యేనిటవచ్చుట మూఁడుపాళ్ళుగాఁ
బంతులుగారు మొన్న మిముఁ బ్రస్తుతిఁజేసిరి నాకువారికిన్
సంతతమైత్రి వారికి మనం బలరుం గనకాంగియున్నచోన్. 14

శా. అయ్యా యొక్కరహస్య మాసుదతిపై నాతండుకన్నెసె నే
యయ్యో శ్రీహరి తప్పుమాటగద వేశ్యాంగనాకోవాంఛించక
వెయ్యారేటికి దానియింటిగడప న్వీక్షింపఁడొక్కండు నా
కెయ్యింటం బలురాకపోకలుగదా యూత్కొల్లకున్ మున్నుగన్
చ. అగుదురుగాక వేశ్యలు కులాంగనలున్సరిగారు వారికిం
జగతిపయిం గులాంగనలె సానులుగాఁజరియించుచుంట న
మ్మగువల కూటిలోఁబడియె మన్నటుగావున నాటపాటలం
బొగడిక జెంది యొక్కగతిఁబొట్టలుపోయుచునుంద్రి రియ్యెడన్
ఉ. విన్నదిదాఁచనేటికిక విప్రవరా యదియచ్చటచ్చటం
గన్నెరకంబునాటి సుదగాఁ జరియించునఁట నిజంబొ యి
ట్లన్ననికేమనన్ శివశివా మగపుర్వును దానికంటితో
నెన్నఁడుఁ జూడఁబోదచట నేను నెఱుంగని చాటుగల్గునే.
ఉ. చాటుననైనఁ బల్కవలె సత్యము కేశవరాయ భూమినా
పాటి వరాంగనల్గలరె పంకితమండన యట్టులైన నీ
చాటును గూరుచున్న మనపల్కులు సాఁగవు తిన్నెపైని బ
ల్వాటముగాఁగ నుండుమని వారట కేగిరి చంద్రశేఖరా. 18
ఆ. ఆతఁ డప్పుడు వల్కె నతనితోఁ గనకాంగి
యేమి విద్య లభ్యసించె మఱియు
నెట్టి రూపుఁగలది యెంతటి వయసది
విస్తరింపుమయ్య వినులలర. 19
చ. వలఁబడుచుండె నీతఁడని పంచక బోడబుఁజెంచి యాత్మలో
నలరుమఁబల్కె నిక్కలికి యందము సర్వము నుగ్గడింపనా
కలవియె యొక్కసారి గననొఁగద నీకు వయస్య దానితోఁ
గలపనియేమయా మనకుఁ గాలవినోదముగాఁగఁ జెప్పఁడీ 20

సీ. ఇంతి మధ్యము సొంపు నీక్షణంబుల పెంపు
మృగరాజమును రాజ మృగము నెంచుఁ
గలికి చెక్కులతీరు గంధసమూహముపొంపు
రాజతాబ్దము నబ్దరాజిగెలుచు
రమణిగుబ్బలయొప్పు రదనాంశుకము సొంపు
బంధురాగము రాగబంధువనును
భామవక్త్రము హేల పాణియుగ్మముఁబోల
యబ్జమానిత సూనితాబ్జమణంచు
గీ. నతిన నడకలయొప్పు నూగారుచొప్పు
గంధనాగంబుఁబట్టు నాగ గంధమనముఁ
బడతి క్రీడచాలును పలుకుమేలుఁ
జంద్రహాసంబు భృకుటుహాస చంద్రహాసు. 21
ఉ. ఆవెంకటల్క్ష్మియండమున కచ్చెరువొప్పెడు వీణపాటయుం
బూప్రను దావి గూడుకొను పోలికఁజెన్నొసంగు దానిపైఁ
దీవ నటింపఁగ్రమ్మనెల తేంట్లక్రియఁగుమలింత పూలఁగాఁ
జేవనిగా నటించుసిరిఁజెప్పఁగ దీరునె చూడఁగావలెన్. 22
క. ఉన్నది మీకడఁ జెప్పక
యున్నన్ మిత్రుండన నేమి యోద్విజ నాకుం
జెన్నిధి సుము సంగీతం
బన్నన్ సూక్తులు నను జనపు నప్పటి నుండియున్ 23
మ. సుమపూజల్ జపము ద్రపంబులును దానుల్ బాముట స్వేదమా
త్రముల న్వాగుటయున్నదానమనుచున్ నాన్నెన్నుమాతంద్రి పి
త మటంచుం దగలేయుచుండెను సుమీ దప్పెల్లనోక్కింతలా
భము గాన్పించదు ప్రెయ్యునీనివలనం బాహాటయే లాభమా.

సీ. రమణీయంబుగ వీణఁబాడుకొనుటో ద్రావిడాంధ్రకో సానిమే
ళములో యిమ్ముని యొఱ్ఱమేనులకుఁ గాలక్షేపముల్లేక వి
త్తము లెల్లం జెడ త్రాగుళ్ళప్పులునుమేల్ దైవంబులంచెంచి దం
డములుంబూజలు సేయుచుందురరెరేనా కేలఁ బైఁజెప్పఁడీ. 25

ఉ. నిత్య మనేకుశా కవు లనేక పదంబులు జావళీలు సా
హిత్యములుం స్వరాలుజతులిచ్చుచు సక్కామరాలుపాడఁగా
నృత్యము సేయఁగా నరసి నేఁడు కృతార్థులమైతి మంత్రాగిన్
సత్యముగా వచించెనను సంతసమంబోయక తీర్థవానోక్తో. 26

క. మీఁగడవలెఁ బ్రాయము వి
ద్యాగౌరవ మొక్కచోట నరిది సుదతికిన్
రాగము గళమున వెల్వడుఁ
దీగను గన్నుచ్చునంటుఁ దీసెడు కరణిన్. 27

చ. ఇటు కపటద్విజుండు వచియించుచునుండఁగ నంత కేశనా
తోటుకున రమ్మటంచుఁ దన తండ్రి యిలుంగిడలేచి యంతఁ జుం
బటపటమన్లు దీబుకొని మాగృహమందదె పుట్టినున్గని
వ్వటికిఁ జనుం డటంచరిగె బ్రాహ్మణుఁడుం జనె వేశ్యయింటికిన్

క. ముదుసలి వెలయాలిం గని
యిదె మనయక్కింపుకేవ నించుక పువ్వుల్
బొదలెడ నడుచు నాద్యంతము
కొడుకకక యప్పుడదిబ్బేల్లు గుఱుకొనిచెప్పెన్. 29

శా. అంచంచం దేగంటిత్రోవనలమై నహర్మ్యంబులంబోలు చుం
దంటివారిధము చాటప్పనం గురుమహీధ్రంబుల్ వలెన్ వాహినీ
కాంతుండో యన సందుఁబెల్లగు తరంగంబుల్ వలెం బ్రోల్లస
త్కాంతారంబులపోల్కి నంసలి మృగేంద్రంబుల్వలెన్ మేఘముల్.

మ. పవలున్ రాతిరియొక్కరీతిఁదనరం బల్చీఁకటుల్ గార్కొనన్
దివినెల్లన్ మొగులావరించి యతి సాంద్రీభూత వర్షాంబు బిం
దువుల్ జల్లఁగనందుఁదోఁచెనురువిద్యుత్కాంతులభ్రంబునన్
రవిదీప్తుల్ గనరామి నిల్పి రన నీరంధ్రంబుగాదిక్కులన్. 31

క. అభినవగతి నొకచెంతన్
గుభగుభగర్జిలఁగ వాన గురిసిన మనకున్
విభుఁ జేరవలను పడదని
యభిసారిక మనము వజ్రహతిచేఁ గుందెన్.

ఆ. పగలునిశయువేఱుపడరాక యయ్యెడ
దీర్ఘరాత్రియౌచుఁ దేజరిల్ల
భోగలాలసులగు పొలఁతులుఁ బురుషులు
మేలి వానకాఱు మెచ్చి రపుడు. 33

గీ. మున్ను నిర్మలమౌ నింగి మొయిలుగ్రమ్మ
మలినమైతోఁచెఁ బుడమియు జలముగ్రమ్మ
తళతళమటంచుఁ బెంఘూళి దరిగి యొప్పె
నౌర వర్షాగమక్రియా వ్యత్యయంబు. 34

వ. అట్టి ప్రావృట్కాలంబున నొక్కనాఁడు చిట్టిపాప బాపఁనిం
జూచి యిక్కాలంబు తరుణ జన దుస్సహంబు మన కన
కాంగి సుదువ సిగ్గుపడుంగాని మనంబునం దోడిచేడియలం
జూచి ముచ్చటల మురుగుచుండు నిక్కార్యంబు మఱచితి
రేయన నాకు మఱపుజనించునే సమయంబు వేచుచుంటిం
గాకయని కనకాంగివర్తనంబునం గేశవరావు మనంబు రం
జింపవాఁడై యొకింత చింతింపి ఎయలువెడలి రామదాసు
కడకుంజని యిట్లనియె. 35

ఉ. వ్యాజములేని భక్తిగలవారలు దుర్లభులెంచి చూడఁగా
నీజగమందు నుంద్రు దమ కీడగు భక్తులు వేలలోపలన్
మీ జననంబు సార్థకము మెచ్చుటకుం దగియుండె వారయం
బూజలు నుత్సవంబులును బొల్పుగసాఁగును పీఠసన్నిధిన్. 36

క. నావుడు నాతండిట్లను
నో విప్రవరేణ్య తావ కోరు కృపవన్ మా
దేవుని నిత్యోత్సవములు
గావించుచునుంటి నెట్లుగానగునో పయిన్. 37

ఉ. ఇష్టతఁగాన రాదొకని కేనియు మాగృహమందు దీనిపై
గష్టముగాఁగఁ దోఁచెఁగద కాలము వృద్ధతవచ్చె నాకుఁగ్రొ
ష్టాటమి చేరవచ్చె నెటులానొక్కొ యుత్సవమంచు నెంతు వి
స్పష్టముగాఁగ దేహమునఁ బాటవమున్నను వీడ నిప్పునిన్. 38

ఉ. వైదికుఁడిట్టు పల్క నిఁకవద్దనినన్ నెరవేరు నిట్లు లే
లేదియురాదు మీశపథ మిట్టిది కృష్ణజయంతి నాఁడు పూ
జాదులు స్తోత్రగీతములు నాఁగదయయ్యె తలంపువచ్చెమీ
కాదిన ముత్సవంబునకు నైతగుమేళము సిద్ధమయ్యెనే. 39

ఆ. చిట్టిపాపసాని పట్టియూకన కాంగి
వీణవిద్యయందు గాణ మిగుల
నభినయంబు దానిహక్కు ముల్లియసుఁడీ
శ్లోకములను బట్టు సొగసు గలుక. 40

క. దానిం బిలిపించినచో
జానుగ నయ్యుత్సవంబు జరుగును మీకున్
నేనుమవనేల్కఁ గాంచిన
చో నచ్చుంగాదె బాని చోద్యంబెల్లన్. 41

ఆ. మీరునాకుఁ బ్రాణమిత్రులు గావున
దానినెఱిఁగియుంటిఁగాన నింత
నొక్కిచెప్ప వలసెఁ బెక్కేల నటుపైని
జిత్తవృత్తిఁ జేయుఁడనిన. 42

ఉ. వాడుకగాఁగ నిచ్చటికి వచ్చును పద్మము మేళమైన నో
బాడబవర్య! మాతమొక సారి యదేమది నచ్చెనేనియున్
వాడుకఁ జేతమంచతఁడు వల్కఁగనల్ప ధనవ్యయంబుచేఁ
గూడికఁ జేతు నేఁడెయని గొబ్బున నేగఁ బ్రమోదమందుచున్

క. ఈరీతి యెల్లఁ బాపకు
ధారాళముగాఁగఁ జెప్పె ధరణీ సురుఁడుం
జేరంజనెఁ గృష్ణాపమి
వారాంగన యచటకేగఁ బఘుసంబయ్యెన్. 44

వ. అయ్యెడఁ బాప కనకాంగి కిట్లనియె. 45

సీ. సన్నదువ్వెనదువ్వి నున్నని కొప్పుపై
నించుకపై మెఱుంగుంచవమ్మ
తొలుతసబ్బునఁ బుట్టు పిళపెళవాయ మో
మున నత్తరుమెఱుంగు నునుపవమ్మ
పచ్చకప్పురతావి హెచ్చఁగాఁ గణికతో
నిద్దంపుకాటుక దిద్దవమ్మ
మిసిమిలోఁ గుంకుమ మెఱిసిన్న శలాకఁ
దిన్నగా నును బొట్టుఁ దీర్పవమ్మ

గీ. అంగములు కైకబిగువునఁ బొంగియుండ
బెడ బెడల్కుగమ్మ చప్పావడకుఁ బైని

గలదు లేదను పయ్యెద నిలుపవమ్మ
చీర చెఱఁగును గాంచికఁ జేర్చవమ్మ. 46

సీ. పలురంగు గలతీవ పనిమీఱు నొడికంపు
కుచ్చెళ్ళ పావడఁ గుదియఁ గట్టి
బటువు గుబ్బల సొరుబైటఁ బెట్టెడు సన్న
రంగుబుటేదారు రైకఁ దొడిగి
కలదు లేదన దనకౌనున కెనయౌచు
నీటైన వలివల్వ పైఁట వైచి
జవ్వాదు కొఁదీవ. నొవ్వ ముంగా ముఱఁ
గంత సుకానొడ్డాణ మమరఁ జేసి
గీ. సబ్బుదోమిన మోము సొరుబ్బు దేరి
మిసమిసలు గ్రమ్మ మైనపు మెఱుఁగునెట్టి
మోవి కావికిఁ దోడు తాంబూల రసము
చాలదని యెంచి లాక్షారసంబుఁ బూసి. 47

ఉ. కన్నులసొరు హెచ్చు ననుకాటుకఁ దెరిచి వాఁడిసూదితో
నెన్నుటిబొట్టు విశేషకము నిల్పి యకృత్రిమశోభయయ్యు ము
న్నున్న వికాక కొన్నినగ లూపికతో నొరవుం గ్రహించి యా
కన్నియ యొప్పెఁ దివ్యవిలుకాని మెఱుంగు కటారిపోలికన్.
చ. బొమగవయందుఁ గాటుకను బూయుట సల్పొసరంగఁ జేసి రం
గమరఁగ బల్చనై నరలయందొనరంగను రెండు మూఁడు సొ
రములిడి కొప్పు వెట్టి వెడరంగును సక్కియునొప్పు ప్రాఁత చీ
ర మఃదుడలొప్పు దేహమును గ్రమ్మగ బోఁపయుదాను వెల్వడెన్
చ. నడుము జవాడుచుండ లలనామణి యప్పుడు భూతలంబునం
దడుగిడుచుండ నయ్యెదటు నంటిపయోధరయుగ్మ మొప్పగా

బడిబడినుబ్బి తూలిపడె బాటనెదుర్పడు పిన్న ప్రాయపుం
గడుసరులెల్ల గ్రక్కున నెగాదిగఁ జూచుచు డిల్లవోవఁగన్ 50

సీ. నిగనిగలాడు పెన్నెరిగుంపు కీల్జడ
మల్లెపూసరులతో జొల్లెమమర
జిలుగు బుటేదారు చీరచెంగొక ప్రక్క
లేఁగాడ్పుచే నొక్క లీలఁ జూపఁ
బయ్యెద నమరెడు బంగారు కంటియుం
దరుచు గుబ్బలు తూలఁ దన్నుచుండఁ
బాపట దరి నిరుప్రక్కల వంపులై
ముంగురుల్ నొసఁటికి ముద్దులీన

గీ. మాటల విలాసములును మేల్ పాటరసము
నాటుబెడంగు మనమున నాటఁ జేసి
వాని రీతిఁ గఱఁగింతువో సతాంగి
యనుచు నచ్చెలిఁ దెచ్చెను జనని యటకు. 51

వ. మఱియుం గొందఱు వారముఖ్యలును జట్టిపాపయు, మూర్ధం
గిక వాంశిక వైతాళికాదులుం గూడ సన్నాగవాసంబు రామ
పీఠసన్నిధికిం జనియె నంతట. 52

సీ. తన మేని నెత్తావి తరుణనిష్కుటపుష్ప
ఆలదళిబృందంబుఁ బిలచుచుండఁ
దన చూపు లెదురైన మనుజునిపైఁ జల్లు
మొల్లంపు విరిసరుల్ చల్లుచుండఁ
దన తనుచ్ఛాయలు తఱుచుగాఁ దొలుకాఱు
మిన్నైంచు దెస లావరించుచుండఁ

దనదు లావణ్యంబు గనుఁగొను జనముల
వీక్షణ బృందంబు వెంటఁ దగులఁ
గీ. గుసుమ శరవీరుఁ డేపున ఖురళికా వి
హారములు సల్పుచును నేర్పులమరఁ ద్రిప్ప
నసిలత యనంగ మీఱు నకుసుమ మృద్వి
రమణి నయ్యెడఁ గేశవరావు గాంచె. 53

క. కనకాంగి మేళమనుచుం
గనుఁగొన వేడ్కలు జనింపఁగా నప్పురి యౌ
వనయుతులుఁ బిలువకున్నం
జనుదెంచిరి దీముకడకు జంతువులవల్లెన్. 54

సీ. పండు వెన్నెలరీతి నిండువారెడు జరీ
ఖండువాసవరించుచుండునొకఁడు
ఉంగరంబులతీరునంగిరజాలను
ప్పొంగుచుదిద్దఁగడంగునొకఁడు
వాచిజేబునలాగియాచెలినావంకఁ
జూచునోయనికైపుఁజూచునొకఁడు
అంచులుచేఁపట్టికంచుకంబునుగట్టు
పంచెపైదిగనవరించునొకఁడు
గీ. వెడఁగునుడువులనొక్కఁడునడఁపఁదొడఁగె
నచటితరుణులుపలుపోకలందిరిట్లు
వారిననేల యౌవనవైభవంబు
మించియెంతటివానినాడించదొక్కొ. 55

క. ఫుల్లాబ్జనేత్ర పదమున
ఘల్లని యాకస్మికముగ గజ్జలు మ్రోయన్

జల్లుమని యువజనంబుల
యుల్లంబులు చెదరి ప్రకృతి నొందకయుండెన్. 56

క. ఈమెయిఁ దొలి యడుగుననే
యా మనుజుల మనములెల్ల నటుచెదరెఁ గదా
యేమేమి యభినయించెనొ
యేమేమియుఁ బాడెనో యదెట్లగుఁ దెలియన్. 57

గీ. మద్దెలకు మ్రొక్కి గాజులు సద్దుసేయ
సభకు మ్రొక్కంగఁ గొందఱు సాహసించి
కైకొనిరి యింత భాగ్యంబు గలదె మనకు
నెందుకని యూరకుండిరి కొందరచట. 58

మ. శ్రుతులం జక్కఁగ మేళగించి గళములొక్కొకటంబుగాఁగూర్చియు
య్యతివ ల్పాడుచునుండ వేఁబుపది యయ్యబ్జాక్షికంఠస్వనం
బతిరమ్యంబుగఁ గిన్నెరం గలియుచు న్హాయింఘటించె బయో
గతమై మీఁగడఁగూడినిల్చిన సితాఖండంబు చందంబునన్.

క. గరిడీ మారుఁడు ద్రిప్పెడు
చురియయొ యతఁడాడుచుండు చొక్కపు చెండో
తిరిగెడు తత్తురగమొ యన
భరత మతాను గతినాట్య పటిమంజూపెన్. 60

చ. అభిరుచినన్ను బిల్చె ననునాదర మొప్పఁగ సైగఁజేసె నా
కభిముఖయాచు నన్వె నను నందము మీఱఁగఁ జూచెనంచునా
సభఁగల వారలెల్లఁ బలుచందములం దలపోయు చుండఁగా
నభినయ రీతిఁ జూపె నహహా యది చూడని జన్మమేటికిన్.

ఉ. అ క్కనకాంగి తాళగతి నందము మీఱఁగ గొంకి సల్పియొ
క్కొక్కతఱిం దుడన్నిలచి యొక్కొకపాదము వెనక్కు వేయుచుం

జక్కని చెమ్మట ల్వెడలఁ జిమ్ముచు నత్తైడలించి ప్రేపులన్
ముక్కర మెత్తుచుం దుడచె మోవులుపయ్యెద చీరచెంగునన్.

ఉ. తావులఁ గ్రమ్ము నూరుపుల తాకునఁ జన్నవయుబ్బుచుండఁ గ
న్నీవలువాడు సూపనొక కేలవలగ్నము నం దమర్చి మై
దీవియఁ గొంతకొంతలపు దీరఁగ నొక్కరుపూలచెంగున
న్నీవఁగఁ గాంచు పండునకు వృద్ధునకైన విరాళమెత్తదే. 63

క. తరుణి పలు పరుసలం బఁబు
వరుస రయోకింత గనరాఁగఁ బాడుచు సరగన్
గిరగిరఁ దిరుగుచు నిలచుచు
నొరఁగుచు మరుకేలుబొమ్మరయా చుననొప్పెన్. 64

ఆ ఆటవెలఁది గీతి కతి చమత్క్రియ నిచ్చె
భిన్నభిన్న పాదవిన్యసనము
ఆటవెలఁది గీతికదియుక్తమాఁగద
భిన్నభిన పాద విన్యసనము. 65

మ. కనకాంగి సతి నృత్తవైభవము యక్కళ్యాణి లావణ్యమో
వనితారత్నములం గనం గలుగు నవ్వాంఛా విశేషంబో యే
మన నచ్చోఁ గల బాలవృద్ధులును జెప్పొప్పంగ నీదయ్యె యా
వనవంతు ల్దమ రెవ్వరో యెఱుఁగు టబ్రంబౌచూఁదో చెందుదన్.

క. అది తనకు మ్రొక్కెనంచున్
మదిఁబొంగుచు శాస్త్రి మాటిమాటికి రాగం
బిదిగా దది యదిగా దిది
పదము లు స్వరములును గృతులుఁ బల్లవు లనుచున్. 67

ఆ. చెలువ నీకు నేనుజెప్పిన శ్లోకంబు
లెచటఁ గలవటంచు హెచ్చరించి

హాయి హాయి యనుచు నానంద రసమునఁ
గలఁగి మునిఁగి తేలఁగాఁ దొడంగె. 68

ఉ. పాప తనూజ యప్డు తన పయ్యెద చెంగొసిఁగట్టి ముద్దుకేల్
మోపక మోపి టీటియలప్పువ్వులుదుస్సియొసిఁ ఘటించుచున్
జోపిన తేంట్లుకుల్కిపడి ప్రుక్కి గిరుక్కున మళ్ళుచుండ పు
ష్పావచయంబుఁజూపెఁ దనయందు సభాసదులైక్యమందఁగన్

క. కాశనిభగాత్రశంకర!
యాశారద యో నటించునని యెంచెదు న
క్కేశవరాయని చెవియం
దాశాస్త్రియు నేమొ యేమొ యలరుచుఁ జెప్పెన్. 70

సీ. వల్లులలోఁ గల్పవల్లి చందంబున
రాత్రుల లోపల రాకరీతి
విద్యల సాహిత్య విద్య విధంబున
నర్థాలంకృతులలో నుపమఁబోలె
భాషలలో శిరోభూషణ మౌరీతి
నదులలో పలవియ న్నదియుఁబోలెఁ
గృతులలో నాటక కృతివిధంబున నెల్ల
గోవులలో నింద్రు గోవువలెను.

గీ. వాక్కులం దెల్లఁగన సత్యవాక్కుగతిని
సరసులందును మానస సరసి పగిది
గీతులందెల్లఁ బల్లవ గీతి రీతి
నాతులందెల్లఁ గనకాంగి ఖ్యాతిఁగాంచు. 71

వ. ఇట్లు జరుగుచుండ నాశాస్త్రి ఛాత్రికి గన్నీటుటయు నానన్న
యెఱింగి యది కేశవరావు దిక్కుమొగంబై " నిన్నే నమ్మి

నానురా" యను జావళీ యభినయించుచు నతని నుద్దేశించి తన యనురాగం బెఱింగించునదియుంబోలె నిట్లు రెట్టించం దొడంగె.

క. నిన్నే మఱి నిన్నే యిఁక
నిన్నే నిన్నే యటంచు నేర్పలరంగా
సన్నలు సేయుచు నుండఁగ
నన్నాతిం జూచి యిట్టు లనుకొనె నాత్మన్. 73

క. ఓరా! యీచక్కందన
మౌరా! యీగానవిద్య యౌరా! హాయిం
బేరామ సృజించియుఁ బెర
నారులఁ జేయంగ నాన నల్వకు లేదో. 74

క. సారప్రచురము రుచి కా
సార ప్రచురమును నాభి సారసము నవల్
హార ప్రచురమగు నీ
హార ప్రచురము పయంట యౌరా! చలికిన్. 75

ఉ. తేఱినపాల నిగ్గు గడి దేఱిన విద్దెల పెంపు రాశి యం
దేఱిన మావిపండు నస దేఱినమౌక్తికరాశి భూమి కే
తేఱిన తార చెంతకరు దేఱిన తంగెడు జున్ను సానలం
దేఱిన మేలి కెంపు పువుఁ దేఱిన తేనియ యింతిచూడఁగన్. 76

మ. జగతిం దీనినిఁగూడు భాగ్యమునకై జన్మించియుండ్రిద్దఱో
ముగురో వారలు దక్క సర్వజనసంబుల్ వ్యర్థముల్గావె చె
న్నుగ లోకంబున లక్షలుండ్రుగద సాన్ముసానులే గాక యీ
యిగురుంబోడి పదాగ్ర రేణువులతో నీడౌదురే యెన్నఁగన్.

ఉ. ఈజవరాలి కేల విడెమిచ్చితి నేనియు సార్థకంబుగన్
నాజననం బొకింత యని నర్మిలి వీడెముఁ దెచ్చి యిచ్చె యీ
రోజున నీకతంబున సరోజముఖీ విపులోత్సవంబు మే
లై జరిగెంజుమీ యనఁగ నాతనితోడను బాపయిట్లనున్. 78

చ. కవకను మీకు సౌకరగుగా యిది దుర్లభయౌనె మాపయిం
గనికరముంచుఁడీ యటు పికారుగనైనను నొక్కసారి ద
ర్శన మిడకుంటిరే సెలవొసంగుఁడటంచు వచించి వేగఁ ద
జ్జనకునియాజ్ఞ మేళమునిశాంతమునొందె నిశాంతవేళకున్. 79

ఉ. చూచుచునున్న వారిమనసుల్ హరిపీఠముచెంతశోభయున్
దాచిన యట్టి కేశవుని ధైర్యము నక్కనకాంగి కొల్లగా
దోచి బలంబుమీఱఁ దనతోఁ గొనిపోయెనో యంచుసర్వముం
దోఁచెఁ గళావిహీనమగు దోయజశత్రునిమూర్తికైవడిన్. 80

గీ. శాస్త్రియప్పుడు వీటి ప్రసాదములను
వారొసంగఁగఁ గొని తన వసతి కేగె
యోగ మెట్టులుండెనో వాడు తీగె పగిది
మారు మానిసిమైయుండె మరులుదగిలి. 81

ఉ. దాని యొయ్యారముం దలఁచు దానివచోమధురత్వమెంచుఁ ద
ద్గాన రసాయనంబు దన కర్ణములం బ్రసరించునట్లుగా
ధ్యానముసేయు వేఱు పనులందుఁ బరాకువహించునే బ్రా
హ్మణుఁడ నేమిసేతునని తీరని కొందలమందు నాత్మలోన్. 82

వ. అట నమ్మ్లేచ్ఛఘ్నుండును దన మనంబున 83

క. మనసుండిన విశ్వాసం
బొనఁగూడుచునుండు నదియు నొనగూడినచోఁ

గననగు యుక్తాయుక్తము
జనుఁడెంచఁగ దానిచే నసాధ్యుండు గదా. 84

క. కావున నీయెడఁ గేశవ
రావునకుఁ మనసుచెడి తిరముగాకుంటఁ
నా పెరవు పెంపున వ్వాల
లో వేసెద ననుచు నతని లోఁగిఁటి కతిగెఁ. 85

క. ఒరులకులోనై చెలఁచుం
బిరబిర దుష్టుం డితరుల మృగయుని వశమై
తిరిగెడు దీపకమృగములు
పెరమృగములనెల్ల వలలఁబెట్టెడు రీతిఁ. 86

క. అతఁడాతనితో ననెఁ జూ
చితివే కనకాంగి విద్యఁ జెల్వము వయసుఁ
మతికెక్కెనె నావాక్యము
వితథముగాదుగద యనిన విని కేశవుఁడుఁ. 87

ధ్రువకోకిల.

ధరణిలోపల దానికీడగు తన్విలేదుగదయ్య మీ
కరుణచేఁ గనుఁగొంటి మీ కుపకారమేమి యొనర్చెదం
బరమ మిత్రులుగాన దాచక పల్కుచుంటిని మీకడం
దిరముగాదు మనంబు సుందరిఁ జెలిచూచుటయాదిగాఁ. 88

సీ. అంతరంగంబునెట్టి కార్యంబునందు
హత్తుకొల్పిన నచ్చెలి యందెనిల్చు
నెత్తెఱంగునఁ ద్రిప్పిన నుత్తరదిశ
నిల్చు కంపాసు పోలిక నెమ్మొకాఁడ. 89

క. అచ్చెలికి నాపయింగల
నచ్చిక యేరీతిగలదో నాతుల మనముల్
జెచ్చెరఁ గఱఁగవుగద పొర
పొచ్చెము లేనట్టి నరుని పొందికకైనన్. 90

వ. అనిన నవ్వించుకుంచిట్లనియె. 91

చ. కటకట! యీగతిం దలఁప గాదుగదా పరిపాటి వేశ్యగా
నిటు దలపోసి పల్కనిఁక నేమన నాఁడది వీడలేక యి
చ్చోటు నిదుపీకిపోయి కడుస్రుక్కుచు మానదు నీతలంపు ని
ప్పటికిని నాదుపట్టిపయి బాస యొనర్చెద నమ్మవేనియున్. 92

చ. అది విని యాతఁడుం బలికె నానలువెట్టుట మీకున్యాయమే
యది మనయింటికి న్మఱల నప్పట నప్పట వచ్చునట్లు జే
యుదువె వయస్య! పుణ్యమగు నొద్దిక మజ్జనకాంతరంగమున్
వదలక త్రిప్పుమయ్య శనివారపు సేవకు వచ్చునట్లుగాన్. 93

మ. పలుకున్ శాస్త్రియు నింతదూరపు పనిం బట్టంగ నేలా నిరా
కులత స్వేచ్ఛఁ జోవుచుంటః తగదోకో మీకు దానింటికిం
గలికిం జూడఁగవచ్చు నిచ్చమెయిఁబల్కన్వచ్చు గానామృతం
బెలమిం గ్రోలఁగవచ్చుఁ గొంకొదవుగా దే యిచ్చట న్నావుడున్

ఉ. ఆక్రియ నిచ్చమైఁ దిరుగ నాత్మకు సాహసమందఁ గల్గునే
యక్రమ కార్యముం దలఁచునంతట నెల్లరు నంతవారికిన్
వక్రగుణంబుగల్గు చెడువాఁడుదయించె నటంచుఁ బల్కనా
ప్రక్రియ యోర్వఁగాఁ దరమె పైఁబడుమాట మరల్పవచ్చునే

మ. అనినం బక్కుననవ్వి యాతఁడను నాహా సాహసంబింతచే
కొన కిల్లించిన నిచ్చదీరుటకు లోకుల్గన్న నేమందురో

యను నాభీతికిఁజాల దవ్విడె యకృత్యంబంచు పీడం బరాం
గనలంగూడుట లెంచ దుశ్చరితముల్ గావో జనుల్నవ్వరో.

క. పుడమికి ననుకూలంబుగ
నడుము టవశ్యంబె మీాజనకు పీఠంబుం
జెడుగులు గొందఱు నవ్వుదు
రుడుగుదురే యింతమాత్ర నుద్యోగ్యంబుల్. 97

సీ. బుచ్చివెంటరావు వెచ్చపు వెలఁదుల
నెందఱీనుంచెనో యెఱుఁగవొక్కొ
మాధవరావొక్క మాసంబుక్రిందట
మాణిక్యమునకెంత మాన్యమిచ్చె
నానంద రావల యమృతంబునకుగొప్ప
మేడఁగట్టించఁడే మిన్నుముట్ట
రామామణికినిచ్చె రాజీవరావొక
కట్టుకాసులపేరు పట్టుచీర

గీ. వీరి కందఱి కపకీర్తి విస్తరిలెనె
క్రొత్త గావునఁ గొన్నాళ్ళు గొణుగుచుందు
రంత మాంత్రాన నేపాటి హానివచ్చు
గణిక నుంచుట నరునకు ఘనతగాదె. 98

క. వీరేమో యనుకొందురు
వారేమోయందురనుచు భయమున ముడుగక
ధీరత జెసి తిరిగినచో
సారము లేకరుగు వానినిస్మం బనినక్. 99

గీ. నీవు జెప్పిన దంతయు నిజమెకాని
యైనఁ దలిదండ్రులేమని యందురొక్కొ

యేమిచేయుదురోయని యింతచొరవ
పుట్టకున్నది యనవిని భూసురుండు. 100

శా. ఔనౌ నిన్నిపరీక్షలిచ్చితివి వే యాక్టుల్ పరీక్షించి త
జ్ఞానంబే ముదుసళ్ళు నక్కలు నడంచం జాలువారే నిరు
మైనార్టీ విడఁ దల్లిదండ్రులు సుతున్నాఁకొడ్డఁగా నాభ్యులే
నేనేమందునో యంచుఁ బల్కితివి గాకీమాత్రముం గానవే.

గీ. కొడుకునకుఁ దండ్రికిని మన కోర్టులోన
బడ్డవ్యాజ్యంబు క్రమముగా భానుమూర్తి
గెల్చుకొనె నప్డు వెంకయ్య గిజగిజమని
తనయుఁడిడు గంజినీళ్ళను ద్రావుచుండె. 102

వ. అవినం గ్రొంతవడి తలవంచి కేశవరా విట్లనియె. 103

శా. ఓనారాయణశాస్త్రిగారు! మదిమీ రూహింతురేమేమొ నే
నానాటిం బలుమారుఁ గాంచుటకు నైయాసక్తిఁగొంటెల్ల వి
ద్యానైపుణ్యవినోదమందఁగఁ జుఁడీ యన్యంబుగాదన్న నౌ
నౌ నేనంత వివేకహీనుఁడనె యిట్లాడంగ నీకేటికిన్. 104

క. నీ యిచ్చకొలఁది జేయుము
పోయెద నిఁక ననుచుఁ జెప్పి ఫుల్లముఖుండై
పోయి వడిఁ జట్టిపాపకు
నా యంశంబెల్లఁ జెప్పె నాద్యంతంబున్. 105

మ. అచటం గేశవరావు తానొక వివిక్తారామముఁ జెంది నా
కెచటంబోయె వివేకసంపద ద్విజుండే తేరువేళన్ మరుల్
ప్రచురంబౌ నని మంచి మాటువడఁగా వాక్రుచ్చితిన్ వెఱ్ఱినై
యుచితంబే యది సత్యమంచతఁడు వేఁబొండేమి గావించునో.

ఉ. ఇంత పురంబునందు నను నేరె సఖీమణి యట్టి ప్రేమముల్
సుంత యెఱుంగలేక వెడచొప్పుగఁ బల్కితి నింతమాత్ర నే
యంతటి రాగవల్లి తెగునా తెగనేనియు వచ్చిపోవుచుల్
దొంతరగా మరుల్ గొల్పుప్రమోదంగద నాదగు నేప్పు పెంపునల్.
పువ్వారుబోఁడి యింటికి
జవ్వన నే నరుగఁ గాంచి చెలికత్తెనల్
అవ్వ యొనరింపకుండునె
యెవ్వం డేతీరువాఁడొ యెఱుఁగం దరమే. 108

మ. జనకుం డెచ్చటికేగియుంటివన నేచందంబునం బొంకుదుం
గవకాంగిం గన నేగెనంచొకఁ డెఱుంగంజెప్పినల్ నాతలం
దునుముం గాకిఁక నిల్వనీఁడుగద నాతోయంబువారెల్ల నల్
జనువొప్పం బరికించ రాజరణముల్ సన్నంబగుల్ భార్యకుల్.

క. అలరువిలుకాఁడు పగయై
నిలువంగానీఁ డిఁకేమి నేర్చెద వెరవుం
గలఁగఁగ నేలా యీగతిఁ
గలవుగదా బ్రాహ్మణుండు గఱపిన పలుకుల్. 110

క. రేపటనో నెల్లుటనో
చేపడదే మంచివేళ చిటుకునఁ బోదుల్
నా పాపమేమి తలఁచెద
తేపకుఁ దేపకునుబోవు లీకొడనదుగా, 111

క. కానంబడె దర్కింపఁ
జానొప్పఁగ నొక్క మంచి సమయం బహహా!
యానొనయూరె యచటికి
నేనిఁక మాన్పింగువాకు నెపమునఁ బోదుల్. 112

క. ఈగతిఁ దర్శించి యతం
డాగరితం జూచు వేడ్క నన్నము మీఁదన్
భోగములందున్ విముఖత
వేగించెన్ కేయి వేయి వేలేండ్లక్రియన్. 113

సీ. నీటుగా రతనాల మీటుగా యన నొప్పు
తేటు గాన్కను మంచి కోటుఁ దొడిగి
బంగారు గొలుసుచే బొంగారు వాచిని
సింగారమొప్ప జేబుం గుదర్చి
నీరు మాడ్కి నెసంగి పేరుమాత్రముగల
చే రుమాలొక జేబు చేరఁజేర్చి
జాలుగా నిపు నుంగరాలుగా యివి యన
మేలు గా కెపు గిరజాలు దీర్చి

గీ. యొప్పు మీఱఁగ నొక చిన్న టోపిఁ బెట్టి
సొగసు మేజోళ్లపై బూడ్సుజోడుఁ దొడిగి
కచ్చ కుచ్చిళ్లు జీరాడ మచ్చెలంట
వెడలెఁ గోశవరాయఁడు వేడ్క మీఱ, 114

సీ. మేలిమి బంగారు మేలైన సరిపెణుల్
మురుగులు చెంగట మురువుఁజూప
దివ్వెల పోలికఁ దేజరిల్లెడు మంచి
కమలము కెంపుల దమ్ముకుచుండ
మిలమిల లాడుచు మేలైన యతలషు
చొక్కాయు యొకవింత సొంపునింప
గమగమ యని దెసల్ గ్రమ్మెడు నత్తరు
తావులు తా నేగు దారిఁ దెల్ప

గీ. మంచి గేదంగి రేకుల సందు నొంచు
తమ్మలపు టాకు లొక్క హ స్తమ్మునందు
మొనలతో నొప్ప మరుని పూములుకులనఁగ
వేశవాటిక కరుదెంచెఁ గేశవుండు. 115

మ. జేబుల లోపలం దనదు చేతు లమర్చి త్వరం జనంగఁబై
జీబు మరుత్పటంబుఁగతి చేతుల వెంబడి నిల్చి యాండ ము
న్నె బయ లేగునో యచటకే చని వేఱొక త్రోవఁబట్టి వే
వేబరులం గనుంగొనుచు వేడ్క భయంబును బోరులాడఁగన్

ఉ. ఎవ్వఁడొ వీఁడు నన్నరసె నేమొకొ యింతుఁ దుహాలెవచ్చె ధా
దవ్వుల వేగ బోయెదను దారొక నెనీతఁడు యోగ్యుఁడంచునా
పువ్వులవింటివాఁడు వెనుమట్టి బడింబడి త్రోయుచుండఁగా
రివ్వున సాని యింటికి శరీరము క్రొంజమ రింటఁగాజనెన్. 117

ఉ. ఈ గతి వచ్చు వాని గని యించుక నవ్వులయంగఁ బాప వే
వేగనె వచ్చి గద్దె యిడి వేడుక గల్గెనొ యిందు నేటి కెం
దేగుచుఁ ద్రోవఁ దప్పితిరొ యెవ్వరి యిల్లని వచ్చియుంటిరో
బోగము చిట్టిపాపయిదిపుత్త్రిక యాఁగన కాంగిదీనికిన్. 118

క. ఈగేహము దీనిది సుం
దోగో బాగో యటంచు నొక లేఱెఁ జూడం
గా గడిదేరి భయంపడ
కీ గడన వెలంది యింటికేటువచ్చితిరో. 119

వ. అనినం గేశవరావిట్లని వచింపం దొడంగె 120

ఉ. అద్దిర యెంతమాట యిటులాడఁగ నీకనుకూలమేకదా
పెద్దల చాటువాఁడఁ గనిపెంచిన వారలతోఁగంగినట్టి యా.

హృద్దున నుండఁగావలెఁగదా యెట్టులైన ... యుబ్జూఁడగా
నిద్రను కేగుడెంచితి సమీహిత సిద్ధి ... 121

శా. నాటం గోలెను నీ తనూజ వరగాన స్వ... మాధుర్య ము
ల్లాటల్గొల్పుచు మానసంబునకు నెట్లో ... నెప్పాట !
ప్పాటన్నే మరువంగ నేర్చెదను పాపా ... పం గనక
నీపుణ్యం బానరింప లేదొకతెయుక్ నిక్క... నిమ్మహిక్.

శా. ఆ వామాక్షియుఁ గానరా దెటఁజనెక్ ... ంబునంజల్లగా
నావీణం బలికించు వారెవరొ యయ్యబ్జాక్షి ... యే
తీవక్ రోయును నద్ది పాపములకుం దెల్లం ... జట్టి వీ
ణావాదంబు వినం గొఱంతపడి యుండ న్నే... రెఁగా123

గీ. నాఁగ నజ్జరఠాంగన నాగయాన
కడకు విచ్చేయుఁడని యతి గౌరవమున
వెంటఁ గొనిపోయి పట్టికి వినిచె వీరి
యతివ కేశవరావుగా రనుచు వేడ్క. 124

ఉ. దిగ్గున లేచి యయ్యతివ దీనిపయిం దయ... ముఁడంచు నా
దగ్గర నొక్కపీఠము నిడక్ వెస నం దునఁ ... డయ్యె నా
దిగ్గజయాన యిట్లనె మదిం గృపగ్గలనె ... ందుఁ దా
రెగ్గడె యందు వత్తురని యెంచుచు నుంటి ... నుక్షణంబనక్.

ఉ. లాతిని నేను నీ విటు దలంతువు విస్మ... లై వీణకున్
నాతిరొ మాటలేటి కనినం దగఁ బాడఁ ... ంగ నింతియుక్
ద్యోత తరుణీ కరాగ్ర పరిధూనిత మంజు ... బికా రవ
ఖ్యాతి రమాతి భూతి సుమహాతి విధూతి ... తి భాతిగాక్.

గీ. అట్లు పాడంగ విని తృప్తియాన యతివ
వచ్చి తడవాయె నిఁకఁ బోయివత్తు ననిన

మరల దయచేతురే యని తరుణి వాని
కరముఁ జేబూని విడె మిచ్చెఁ గరముమెచ్చ. 127

చ. పడతుక చేతఁబట్టి తన పాణితలంబున వీడెముంచఁగా
నొడలు చెమర్చె నాతనికి నొక్కమొగిం బులకాంకురంబులుం
బొడమె మనంబు మాయమయిపోయె నిఁకేమని చెప్పవచ్చున
చ్చిడిముడిపాటు సంతసము చింతయొ భీతియొ కల్గె నత్తరిన్.

ఆ. కొంత వడికి లేచి యింతిరో యేగెద
మాటఁ జెప్పఁదలఁచి మరచినాఁడఁ
బోయివత్తు నన్నుఁ బూబోఁడి మరువకు
వెడలెదను వెలంది వెళ్ళివత్తు. 129

వ. అనుచుం గదువెఁడగు వడువున నుడివిన నుడువులె వెడ వెడ
నుడువుచు నడుగులు తడబడ నిడుచు నెడదం బడిబడి నడ
లుచు వెడలి యెన్నటికిం డెల్లవాఱు మరల నెన్నటికి
వత్తునని చింతించుచు నిల్లుచేరె నంత. 130

క. ఇటుల న్వచ్చుచుఁ బోవుచుఁ
గుటిలాలక యెరను దవిలి కొడుకక యతఁడి
ప్పటికిన్ మానస ధనమును
బటిమంబున దోఁచుఁగి దాని పాలొనరించెన్. 131

సీ. ఒకనాఁడు చెల్వతో నుల్లాసమునఁ బాడు
నొకనాఁడు సరసోక్తులకు గడంగు
నొకవేళఁ జతురంగ మువిద మెచ్చఁగఁ గట్టు
నొకవేళఁ బగడసాలకుఁ గడంగు
నొకయెడఁ బువ్వుతోఁటకు దానితోఁ జను
నొకయెడ మేడపై నొనరఁ దిరుఁగు

నొకట శృంగార కావ్య కలాపముఁ బఠించు
నొకటఁ జిత్రకథా ప్రయుక్తి నలరు
గీ. ఇటులఁ బ్రచ్ఛన్న గతి నతి పటిమ మీఱ
వచ్చి పోవుచు నుండెడు వాని గాంచి
బోసి యాటను మాటల పోడిమిచెడఁ
బావ డాడలు తాటించి పలుకసాఁగె. 132

క. పగలిటు వచ్చుచుఁ బోవుచు
నగుచుం బరిహాసములను నడపుచు నుండన్
వగలాఁడి మనము మీపైఁ
దగిలి మరల్పంగరాక తద్దయుఁ గుందున్. 134

వ. అయ్యో! యీయింతి మున్న మిమ్మెఱింగి యుండుటం జేసి నాఁ డుత్సవంబున మిమ్ముం గాంచి మీకటాక్షంబున కెదురు చూచుచు మీకుం గబురువెట్టుమని నన్నుం బురికొల్ప వారు దుర్లభులని నేను జెప్పినం గోపించుచు నారాయణశాస్త్రి వలన మీవృత్తంబుం దెలియుచు నిచటికిం జనుదేర మీరు వెలఁగుపడు టెఱింగి వెతం గుడుచుచుఁ గొంతకాలంబునకుం దమ రాకపోకల కలయుచు నిప్పుడు. 134

క. సిబ్బితిచే నుడువమిగా
కబ్బా! మీతోడఁగూడి యునఁగి పెనఁగుచుం
దబ్బిబ్బుఁ జెంద మదిలో
నుబ్బుచునుండెను మనోభవోజ్జ్వలరూపా!. 135

క. మగనాండ్రకు వలె మాలో
మగువకు నీడొదవ నొకని మచ్చిక మీఱం

దగువానిఁ జేరియుండుట
యగు నిది మర్యాద బాసయానెద మీాపై. 136

గీ. పసుపు కూటికైనె పాలుపడుటయేల
కూటికిని గుడ్డకును నొకింత కొదువలేదు
కడుపు గడుపంగ విద్యయుఁ గలిగియుండె
ధనము ఘనమానె మర్యాద ఘనముగాక.! 137

క. ఆర్యులఁ బొందుట మాకున్
మర్యాద యటంచు మఱియు మఱి తరుముటయుం
గార్యంబు గడనయే మా
చర్య లెఱింగించకున్నె శాస్త్రియనంగన్. 138

శా. నాభాగ్యంబిఁక నేమనం ద్రిజగతీ నారీ శిరోరత్నమా
శోభాశాలిని తావరించెనఁట యచ్చో హృద్య గాంధర్వ వి
ద్యా భారంబున నొప్పునంట మఱి యర్థాపేక్షలే దన్యునిం
దాభావింపదు దీనితోడ సుఖ మందంగాదొకో నాకిఁకన్. 139

వ. అని వితర్కించి యాతండు జరఠ కిట్లనియె. 140

శా. నీకుం జెప్పక దాచనేమిటికి మీా నీరేజ పత్రాక్షిపై
నాకుం గల్గిన రాగమెంతయని యెన్నన్ రేబవల్ దానితో
నేకీభావముగాఁగ నుందమని లోనెంతుం బరాయత్తుఁడం
గా కిన్నాళ్ళు సహింతు నేవెరపునంగార్యంబుసాధించెదన్. 141

ఉ. దిట్టఁగాను వేగ దెగడెంపులు జేయఁగ నేటరేపటం
బుట్టిన యింటికన్నఁ గొనిపోవును భార్యను దల్లిదండ్రులుం
గొట్టిన పాములట్లు పడికూర్కువహింతురుగాన నప్పుడీ
పట్టున కేనుత్తునటు పైనలపోతముపై యుపాయమున్. 142

చ. అని యతఁడేగి యింటికడ శ్యాలుని రాకకు వేచియుండ గొ
బ్బున తన యిష్టదైవతము పోలికె నాతఁడు వచ్చి చెల్లెలిం
గొనిచనె నిట్లభీష్ట మొనఁగూడె నహో యను చుత్తరహింజిగి
ర్చిన మదితోడ మేనఁ గయిసేసి దినాంతముఁ గోరుచుండఁగన్.

ఆ. పొద్దుఁగుంకునంత భోజనంబుఁ జేసి
తండ్రి పీఠ సేవ దవిలియుండ
నాకు లత్తరువులు బోకలు గొనిచనె
వడిగ వడిగ నాలు గడుగులుగను. 144

ఆ. చనిన యతని కెదురు కనకాంగి యేతెంచి
యడుగులకును వేగ మడుగులిడుచుఁ
జాల మోదవార్ధి నోలలాడించుచు
నతని భోగరసము లందఁజేసె. 145

సీ. దంతపు తఱిగోళ్ళ వింతగుల్కెడు పట్టు
పట్టెఁ గమ్మిన పట్టెబెడఁగు
పట్టెలపై నాల్గు ప్రక్కలుఁ గమ్ముచు
డంబుగా నుబ్బు పత్తాసిపరపు
పరపుపై బలురంగు పనిమించి జీరాడి
యొప్పులు గమ్మెడు దుప్పటంబు
దుప్పటంబున జీన కప్పడంబు గలీబు
లురువొప్పుచుండు మేల్తరముఁ దిండు

గీ. దిండ్లపైఁ బట్టు కుచ్చులు దేజరిల్లు
దోమతెరయును జాలరు దోఁగుచుండు
మానినీమణి పందిరి మంచమందు
నురు రసాంబుధిలో నతఁడోలలాడె. 146

సీ. మగతాల ... నిగనిగలాడెడు
విరిగోళ్ళ ... వెలిచివెలిచి
వెన్నముద్దల ... నున్ననై యెసఁగెడు
ముత్తెపు ... హత్తిహత్తి
యర్ధచంద్రుని బోల నమరెడు మడతలోఁ
దీరుగా న... దీసితీసి
చిపురుటాకు ... నవకంబుఁ జూపుచు
బెడఁగారు ... నే మడిచి మడిచి
గీ. చిలుక ము... పోలికఁ జెలఁగఁ గొన్ని
యనఁటి బ... పోలిక యమరఁ గొన్ని
కత్తెరల ... సొంపు గాంచఁ గొన్ని
యాకు మడ... సందిచ్చె నతని కతివ. 147
ఉ. ఎంతటి వ... నుదయించెనో యెంతటి వాని పట్టియో
యెంత వివే...కుఁ డతఁడేమన నిన్నియుఁ సున్నజుట్టెఁగా
కాంతయె మో...కత్తె వెలకల్కి-నిఁ జెప్పఁగనేల తత్కటా
క్షాంత నిరీక్ష...షిత సముంచిత ధైర్యులుగారె యెవ్వరున్.
శా. హేలాపట్ట...వాస వాసవవిధిశ్రీశార్ఙ్గితాంఘ్రిద్వయా
శైలాధీశసు... విధేయవిమల స్వాంత ప్రసర్పద్దయా
హేలాపాలి... భక్తలోకమృదులా హేయస్ఫురద్భోగభా
గాలీధామల విగ్రహోగ్రహపతిశ్యామాధిరాట్చక్రకా. 149

దోధకవృత్తము
త్రైపుర దానవ రాడ్వరశిక్షా
కోప విపాటిత ఘోరవిపక్షా
కాపురుషైక విఖండనదక్షా
తాపస చిత్త నితాంత సమక్షా. 150

## గద్యము.

ఇది శ్రీమన్మంత్రిప్రెగడ వంశపయఃపారావార రాకాసుధాకర
రాజబిరుదాంకిత భుజంగరాయామాత్యపుత్రహరితసగోత్ర
పవిత్ర దుర్గామల్లికార్జునప్రసాదరాయవరపుత్రి శ్రీమా
ర్కండేయ వరప్రసాద జనిత కవితాధౌరేయ బుధ
జనవిధేయ భుజంగరాయనామధేయ ప్రణీతం
బైన వారకాంతయను చాటుప్రబంధంబు
నందుఁ ద్వితీయ విలాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీరస్తు.

శ్రీ మార్కండేయస్వామినే నమః

# వారకాంత

## తృతీయ విలాసము.

క. శివ! సర్వలోక నుత యుప
నవమూర్తి విరాజమాన నలినాక్ష శరా
సవకుముదినీశచూడా
భవ భవ పాశాపహార పటుతరనామా. 1

గీ. చిత్తగింపుము పైకతఁ జిత్త మలర
నాతఁ డత్తరుణీమణి యందుఁ దగిలి
యన్య మఱుఁగక ప్రతినిశ మటకు వచ్చి
పోవుచుండెను భోగినీ భోగపరత. 2

క. పలుకుం బలుకునఁ దేనియ
లొలుక న్మాటాడు రాగ ముట్టి పడంగాఁ
గలకల నవ్వునొకప్పుడు
తలతలయని యందు నందుఁ దార్కొనుచుండున్. 3

సీ. ఖేటీ మనోభవ ఘోటీ మరాళ వ
ఘూటీ విలాసముల్ ద్రోచి త్రోచి
చేటీ కరానీత వీటీ రసామోద
పాటీర గంధముల్ మీటిమీటి

శాటీ లస త్తులా కోటీ మణిమయ
కోటీరముల్ దగం గూర్చి కూర్చి
ఆటీకెతనుర్మిమ వాటీ కనత్పరీ
పాటీ విహారముల్ బరపి పరపి
గీ. చకచకలనీను మణిమయ ముకుర నికర
సుకర బహుబింబ విమల శీతకర దర్శ
నకరణాది విలాసముల్ ప్రకటపరచి
పల్లవాధర తన్మతిం గొల్లలాడె. 4

చ. పడపు మెఱంత నన్నియలు బొల్పడె వెవ్వరి కేని యొక్కమా
టాడ లిరియించి నీలు మఱియొక్కెడ నోంగ కురుల్విడల్చిక్రొ
మ్ముడియిడు జారుచున్న చనుపట్టముపై నమరించు నందియల్
దడబడె నంచొయారమున దండమ్మైమె సవరించు నొక్కచోన్.
ఉ. మోహమునందు మాడ్కి నరమోడ్పును గన్గవమారు బారికిన్
డాహము నొందు పోల్కి వదనమ్మున నూర్పులు వుచ్చునల్లనన్
బాహువు లూంచుచున్నడచుం బాపము కేశవరావు వీనిచే
దోహలమై మనం బనిల ఘాత పటంబు క్రియం జలింపంగన్.
ఆ. చుంబ కాశ్మ మందు సూదితాకిన పోల్కి
నంతరంగ మింతి సంటియుండ
మత్తుంగొన్న రీతిం బొత్తు వీడంగలేక
దానియింద నునికి తెలుచు జేసె 7

చ. గుసగుసలాడుకొంచు నొకకొందఱు చుట్టలు మెల్లమెల్లంగా
హాసనముం జేసి కొందఱువయస్యులు కేశవరావుగారి కిం
పెసంగునెయంచుం గొందఱిటు లెచ్చటికేగెదరంచుం గొందఱు
ల్లసములనాడ సాంగిరి చలంబున జంకును డాచశక్యమే. 8

వ. ఇట్టి దుర్వార్త పెనుగాలిం దూలు శాల్మలీతూలంబు చందం
బున నెల్లెడలం గ్రమ్మి వాని యిల్లాలగు లక్ష్మి చెవిం
బడిన నామెయుఁ జెచ్చెర నత్తింటికి వచ్చి మగని చేష్టలం గని
పెట్టి యత్తమామలచెంతఁ గన్నీళ్ళం గ్రుక్కుకొనుచుండ
వార లిట్లనిరి. 9

శా. అమ్మా! కన్నులనీరు వెట్టెదవిదేలా! యెల్ల చుట్టంబులున్
సమ్మోదంబున నున్నవారలుగదా! శారీర సౌఖ్యంబు లో
పమ్మొందకయుండునే విభుఁడు! నిన్ బాధింపకుండెంగదా
యిమ్మాడ్కిన్ వ్యగపొందవెన్నఁడును నేడీచింత యేలాయనన్.

ఉ. నాకు శరీరసౌఖ్య మొకనాటికిఁ దక్కువగాదు సౌఖ్యముం
జేకొని రెల్ల బంధువులుఁ జెప్పఁగ సిగ్గగుచుండె నియ్యెడన్
మీకొమరుం డొనర్చుపని మేకొని యూరకయుండఁజాల న
య్యో! కనకాంగి యంచొకతె యుండె నికేమని విన్నవించెదన్

క. నావుడు గుండెలు జల్లన
భావంబులు తల్లడిల్లి వణఁకొదవంగా
నీవంశపు గీర్తులు జెడఁ
గా వీఁడు జనించె ననుచుఁ గలఁగిరి వారల్. 12

ఆ. తల్లి నీవు మాకుఁ దనయ పోలిక నుంటి
వేమిచేయవచ్చు నీదురాత్ము
మందలింతుమమ్మ మాశక్తికొలఁదిని
నూరడిల్లు మనిరి వార లపుడు 13

ఉ. వారలు పుత్త్రితో గళరవంబులు మాఱ్పడఁ బల్కసాఁగి రా
రార! దురాత్మ! నీ కిటుల యోగడ మేటికి సంభవించెరా

తీరిక దైవమిచ్చు కొలఁదిం దిని యూరకయుండ జాలవే
వారవధూటి పొందెటుల వచ్చెర యెవ్వఁడు నీకుఁ జెప్పెరా.

గీ. హా! తెలిసె నార యల్ల బ్రాహ్మణాధముండు
శస్త్రకాఁడయి నీయిల్లు నీటఁగట్టె
శాస్త్రియఁట వాని చదువెల్ల చట్టుగాను
దాని మేళంబుతో వెంటఁ దగిలివచ్చు. 15

సీ. పెట్టెలోఁగల రొక్క మిట్టిమాయంబైనఁ
బడ మొత్తితిమి నాఁడు పాలివాని
చిన్నపాపని చేతి చిరి యుంగరమునకై
దండించితిమి యింట దాసినప్పుడు
కోడలి తెలిపట్టు కోకకై యొకవేళ
బంధువుఁ బాపంబు బలికినావు
రామపీఠముపయి హేమపాత్రమునకై
పరదేశి నపవాదఁ బరపినావు

గీ. ఔర యివియెల్ల దానికి నర్పణంబుఁ
జేసితివి నిన్ను నెవ్వఁడు చేరియుండు
నింటిదొంగను గాయంగ నెవ్వఁడోపు
ననినఁ దలవంచి మెల్లన ననియె నతఁడు. 16

ఉ. గిట్టని దుష్ట మానవులు కిల్బిష మున్నది లేని దెంతయుఁ
నెట్టనఁ గల్పి చెప్ప నది నిక్కముగాఁ దలపోసి యీగతిం
దిట్టఁగ సాఁగి తిందులకుఁ దీర్పులు లెవ్వరు సాక్షులెవ్వరో
పట్టి విమర్శమెత్తుమని పైపయి నేగెను మెల్లమెల్లఁగన్. 17

ఉ. ఏజనుఁడేనిఁ దన్నుఁ గని హేళన మాడుచునుండ నిందకున్
భాజనమై రహిం గుడువఁ బత్తికిఁజేరక తండ్రి తిట్టఁగా

భోజన మజ్జనాదులను బూర్వపు రీతిఁ బురంధ్రిరత్నమే
రోజును భక్తిచే నడుప రోతకునై యొకిగట్టి గట్టిగాన్. 18

చ. నలుగురు విన్న సిగ్గుడుగు నన్నిఁక నెవ్వరు నేమిసేయఁగాఁ
గలరొకో చాటు దీరెనని కైనలనడ్డ సమస్త వస్తువుల్
మఱఁగక దానికిచ్చు చనమానము మానము నొక్కరీతిఁగాఁ
దలఁచుచు జ్ఞానిపోల్కెనదె తానని యాత్మఁదలంచునిచ్చలున్.

క. జననీ జనకులు నప్పుడు
మన కొక్కఁడె కొడుకుగాన మఱిమఱి వీనిన్
మన సెరియ మందలించినఁ
జనునో యెటకేని ననుచు సంశయపడుచున్. 20

క. మెలమెల్లనఁ జెప్పనిచో
నల తహసీల్దారుగారి యాత్మజు వలెనే
యిలు వెడలిపోవఁ జేయం
గల దేమని మిన్నకుండ్రు కనుఁగొనని క్రియన్. 21

ఆ. ఇట్లు జరుగుచుండ నెవ్వరేనియు వచ్చి
కొడుకు దుడుకుతనము నుడువుచుండ
రామదాసుగారు నేమిసేతు నటంచుఁ
బన్ని పల్కె నొక యుపాయమిట్లు. 22

శా. చేతస్స్థైర్యము దూలిపోవ నొకఁడౌ సిద్ధాంతి మాన్యానికిన్
ద్వైతేయూక కళత్ర యోగమనుచు న్వ్యాక్రువ్వఁగా నెంతయు
స్ఫీతింజెందుచు నేయుపాయమునఁ దప్పింపంగ నౌసంచు నీ
రీతిం బూనె నిఁకేమిచెప్ప ననుచుం గ్రోశించి పల్కుండగన్.

ఆ. వాయిగ్రమ్మియున్న పాత్రికరూపం బొక్క-
పొదవి పట్టనున్న బోసిపులియొ
యనఁగ నొక్కనాఁడు కనకాంగి/జనయిత్రి
పొసఁగ రామదాసు పుత్త్రి డాసి. 24

ఉ. అల్లుఁడ నేఁడు నీప్రియురాలు ప్రహా కలితాంతరంగయై
తెల్లముగాఁగ నీకడను దెప్పక నాకడనైనఁ గొంకుచు
న్మెల్లన దివ్వెపంక్తిగ సమీపముఁ జెందెను మేను దీనకుం
బల్లవరాగ మేరుపకపంసగు సంపద నదించె నావృషన్. 25

ఉ. ఆతఁడు పల్కు- నీవడుగుసంతకు నీగతి నూరకుంటి నే
ఖ్యాతియె యస్వతంత్రుఁడను గావున నింపుక కొంకుచుంటి నీ
రాతిరి కోర్చియున్నను వరాలొనగూరిచి కట్టినట్టి మా
తాతలనాటి పేరొకటి తప్పక తెచ్చియొసంగుదుం జుమీ. 26

మ. అని యారాతిరి యింటనే పడక వేయన్ మేను తుల్యంబుగాఁ
గనకంబబ్బినపోల్కి లక్ష్మియును వేడ్కం గూడియుండంగఁ జ
య్యన నీచెంత వరాలపేరు నిట తెమ్మంచు న్వెఱంగంద యి
చ్చినఁ బ్రత్యూషమునందె తెచ్చి నొసఁగ న్శీఘ్రంబుగా దానికిన్.

క. అయ్యెడ. 28

సీ. చిందులాడెడు మెట్టె లందెలు మేళమై
కరము సొంపున గల్లుగల్లు మనఁగ
సమయంబుఁ గనిపెట్టి చనువ యుపరంట
దొల్కిన లేఁగాను సుళ్ళుచుండఁ
బ్రతి పదంబున దూలిపడుచు దూఁగాడుచుఁ
బిరుదుపై జడకుచ్చు బిసుసుచాట

ఎచ్చు తక్కువమాట నించుక వేళ్ళచే
సారించు పయ్యెద జారుచుండఁ
గీ. జిఱు నగవు వెన్నెలలు తమ్ముఁ జేరు ప్రియుని
దృక్చకోరములకు విందు చేయుచుండ
మోద మొప్పంగ వచ్చి యమ్ముద్దుగుమ్మ
గాఢతరముగఁ గేశవుఁ గౌఁగలించె. 29
ఉ. పిమ్మటఁ బాప యొక్కతతి బిడ్డను జేయఁగఁజేటి యిట్లను
న్నమ్మతిఁబుట్టఁ జేసియును జయ్యనఁ గోపముఁజూపి వాని చి
త్తమ్మతిరక్తి నున్నయెడఁ దార్కొన జాగొనరించియుండగన్
నెమ్మదిమీఱ విత్తమును నేర్పున లాగఁగఁ జాలవేమనన్. 30
గీ. సాని బిడ్డవుగాని సంసారిణీవఁటె
చిన్నదానవె నీకెన్ని చెప్పఁగలను
కలిపిపెట్టిన యన్నంబుఁ గఱపినట్టి
బుద్ధియును మానవులకేమి పుష్టిఁజేయు. 31
క. జవ్వనము శాశ్వతంబే
యివ్వడి దేహంబునందు నించుక తగ్గన్
గవ్వకు మారవుసుమ్మీ
యెవ్వఁడుఁ గన్నెత్తి నిన్ను వీక్షించఁడుగా. 32
క. వేవేగమె ధనమెల్లన్
దేవంగావలయుఁ గాదె తీపున్నపుడే
తీవియబోఁడీ మనమిఁక
నేవిధమున బాగుపడుదు మెంచుము బుద్ధిన్. 33
మ. తరుణీ మొన్నను ప్రాయమొంది చతురత్వంబెంత రోహిణ్యర్చనీ
సరియా పల్లవపాణి యేపుమెయి మేజస్త్రీలువారి స్నిరం

తరమున్ జేబున వేసి లంచములకుం దాఁ గాసియుండు న్నరా
సరి యేడాదికి వేయి రూప్యకములు న్సాధించ లేవేమనన్.

క. బెట్టుసరిన్ ధనమును రాఁ
బట్టు మతఁడు రాగ నింటిపడఁతుక యందుం
బుట్టినచో నీచేతం
బెట్టఁడు పైసయును చిన్నవేక్షించుఁ జుమీ 35

వ. అనిన విని యట్లచేసెద నని. 36

ఉ. కన్నెఱికంబు నాటి సుదగా నినుఁ గోరుచు నెన్నియెన్నియో
యెన్నుచునుంటి నేటికి మదీప్సితము ల్సమకూరె నీవు నే
నెన్నఁడుఁ బాయకుండ నిటులిష్టమయేనియు బాసఁజేత మం
చన్నలినాక్షి వల్క నతఁ డట్లొనరించె వినిశ్చలాత్మతన్. 37

గీ. అకట ననుజూచి వలవల లాడుచుండు
నేమిచేసితి నీభార్య కేనటంచుఁ
గొండెములువల్కు కేశవాఖ్యునకు సాధ్వి
యందు నెయ్యము దొలఁగంగ నాడుచుండు. 38

క. ఒకనాఁడు కేశవుని కం
ఠకు ముఖ భూషలను దొడఁగి సుదతీమణి వీ
ధికిఁ బోకు దృష్టిదోషము
నకు లోఁబడుదువో యటంచు నగుచుం బలికెన్. 39

క. ఆరమణుని నొకవేళం
జేరలతోఁ గనులుమూసి చెప్పుము నే నే
చీరం గట్టితి రవికయు
నేరీతిది నీదు నేర్పు నెంచెద ననియెన్. 40

ఉ. చుట్టలు చెంతనుండ నొకచో ననుకాటుకకన్ను దోయికిం
బెట్టుచునుండఁ గేశవుఁడు మెల్లనఁ జాటునవచ్చి చేలముం
బట్టుకలాగ నుస్సుమని బంధులు చూచుచునుండి రయ్యయో
యిట్టుల వేగిపాటుగద యెల్లప్పుడంచు నొకింత నవ్వెడిన్. 41

ఉ. వెన్నెలబైట సజ్జపయి వేడుకకాఁ డుపవిష్టుఁడైనచో
గిన్నెల గంధము ల్తిరువగాగిన్ మెయిఁబూయుచు నింతి యిట్లనుం
బెన్నిధి నాకు నొక్కటి లభించిన నాజనయిత్రి యాశ దీ
ర్తు న్నిను నెన్నఁడేనియును దొందరజేయక యుండు డబ్బుకై.

ఉ. ఇంతటి వేళదాక యెటకేగితి వీగతి సోఁగలా శిరో
జాంగము లేలకం జెదిరె నంబరమేల నలింగె నిట్లు మే
నెంతయు చేసటం బడఁగ నేమి కతంబొ నిజంబుఁజెప్పు మే
కాంతకు నోముపండె నని గద్దరి మాటలు పల్కు నొక్కెడన్.

మ. విటుఁడేతేరెడివేళ డాగి యతఁడున్ వ్వేవచ్చి యబ్జాక్షి తా
నెటకో యేగెనటంచు సంశయముతో నీక్షించుచుండంగ వె
న్కటి తోఁపనుండి సెజ్జఁ జేరి యతనిం గౌఁగింటలోఁ జేర్చి నే
నెటకేతెంచితి నంచు నాకులతతో నీక్షింతువా కోయనుచున్.

వ. అప్పుడప్పుడు కేశవరావు మానసంబు వశపరుపం దలంచుచు
గనకాంగి వానికి నిట్లని పల్కుచుండు. 45

క. నోచితి నెంతయు నీకై
యీచక్కందనముఁగాన నితరుల కన్నుల్
బూచులుగ నన్ను న్విడఁ
జూచితివేనియును విడువఁజాలుం దనువున్. 46

నిను విడచి యన్యుఁ గూడం
గనుమను మాతల్లి ధనము సంపాదింపన్

నినువిడఁజాలక నీవా
ధనమున్ దానికి నొసంగి తగఁబోషింపు మనుచున్. 47

క. లోకులకు వెఱచి యుంటం
గాక భవద్దేహమందు గదియొకటి యిడన్
నీకడనే నివసించెద
నాక సుఖము లెల్ల మిగుల నందఁగ వచ్చున్. 48

ఉ. ఇక్కడనుండి సామ్మునకు నేమ్చుచునుండును నాదుతల్లి నీ
కొక్కక్షణంబు నీకడన యుండినఁ బిల్చుచునుండుసౌఖ్యముం
దక్కదు కాన నానుండి వినం జగు మీ భవనంబు చెంత నా
కొక్క గృహంబుఁ గట్టియిడనుంచుమునిన్నెడబాయకెప్పుడున్

శా. నాకుం గన్నెఱికంపునాథుఁ డిటనున్నం గీను బంగారమే
కాకిట్లుండునె సౌధ వర్య మతఁడే కట్టించె నేనన్నునిం
జేకోఁజాలక యుండియుండి తుదకుం జేకొంటి మిమ్మెందుచున్
మీకు న్నాపయిఁ బ్రేమలేదు గద నెమ్మిం జూతురే పూరుషుల్.

ఉ. ఆ పణవీధి నీవు సరిగంచుల దోవతిఁ బూనిరాఁగ నీ
దాపున కేగుదెంతునని దాపుడుసామ్ములుఁ బట్టలేకయుం
దోపుపటంబుఁ దాల్చుకొని తోనరుదేరఁగ నేడ్కనుంటి నీ
నాపఁగఁజాలనైతి మది నప్పటినుండియు నిన్నుఁజూడఁగన్.

గీ. పాప దైవంబు నన్ను నీభార్యఁగాఁగఁ
జేయ కీపాడువేశ్యఁగాఁ జేసె నకట!
యిరువురికి నొక్కకులమైన నేలచేయఁ
డొక్కచోఁ దినియొక్కచో నుండుముగద. 52

గీ. బాస లొనరించి ప్రేమముఁ బరగఁ జేసి
యొక్క కపటంబుఁ బన్ని యిట్లొనరకుంటి

ప్రేమగలవారి పీడుట వృజినముగద
పురుషులకు నీతి యనుమాట బొడమఁబోదు. 53

క. నాపయి మీపౌరుషముం
జూపుట పిచ్చుకకుఁబైని జుఱచుఅ(బ్రహ్మా
స్త్రో)పాయము నన్నిట్టుగ
నేప న్నేఁజేయఁగలది యేదియుఁ గలదే. 54

వ. ఒకనాఁ డక్కనగాంగి కేశవరాయని వచ్చువేళం గని య
థాపూర్వంబుగా నుండక కిలకిల నవ్వుచు నెమరేగక కుపిత
చిత్తయుంబోలెనన్న నక్కాముకుండువచ్చి దానింగాంచి గుం
డియ జల్లుమన నిట్లనియె. 55

ఉ. ప్రాణసమాన నీవు వినయంబున ద్వారముచెంతనుండి నా
పాణితలంబు నీదు కరపంకజమం దమరించి నవ్వుచుం
బోణిమిమీఱ హర్మ్యమును బొందఁగఁ జేసి మనోహరంబుగా
వీణియ మీటుదాన విటు విన్నదనంబున నుంటివేమొకో.

క. ఎలనాగ లెమ్ము నీవా
క్కలనాదామృతరసంబుఁ గర్ణయుగద్రో
ణుల నానకుండ నోర్వం
గలనా నాతోడ నీకుఁ గలనా చెపుమా. 57

ఉ. అప్పుడు చిట్టిపాప వినమాధ్యయుఁబోలె వచించె నిట్టుగాఁ
జెప్పెదఁ జక్కఁగా విను మిసీ యిదియేఁ బొగరెక్కి యాకియం
దిప్పులఁ బెట్టుచుండె మదిఁ దృప్తిజనింపక యాసపడ్డచోఁ
దప్పక నిందఁ జెందుచుఁగదా పురుషుండు వధూటియున్మహిన్.
ఒకరి యింట వివాహమహోత్సవమున
గవాసంబు విజయాఖ్య నగరినుండి

వచ్చువారలు దొడఁగిన పలకపూస
నేవళంబులు నవరీతి నెగడుచుండు. 59

చ. అవి కలయంగఁజూచి తన కట్టివిగావలెనంచు గట్టిగాఁ
బొవులుచునుండె గేహమునఁ బుత్త్రికిముద్దలుపుట్టఁబోవు రేఁ
బవలును నిన్ను సొమ్ములని బాధయొనర్పఁగ నోరుతాదు గా
రవ మిటులైనచోఁ దనకుఁదాదుగదా యికఁ జెల్వుగల్గునే.

ఆ. పసిఁడి పూత గిండి పగిదిగా నొకరీతిఁ
గాప్పురంబు మెఱుఁగుఁగాన రాఁగ
మెలఁగవలయుఁగాక పలు పెద్దపోకలు
బోదురేని కూలిపోరె యెరు. 61

చ. పొసఁగని పట్టుఁబట్టి యటు పొక్కుచునుండును నేటికేవు నీ
బసకరు దేర నన్నియును బాగగు రేపటికంచుఁ బంచి య
మ్మసలిది పట్టికి న్మణుల బోధయొనర్చి యథాస్థితంబుగా
నెసఁగఁగఁ జేసి కాముకున కిట్లనియెన్ మరునాటి వేకువన్. 62

ఆ. గట్టి గుండెగలది పట్టిని దూరంగఁ
దగదుగాని నీరు ద్రావకుండె
నన్నమంటకుండె మొన్నటి నుండియుఁ
జేయుబోధదాని చెవినిఁ జొరదు. 63

మ. పరులన్వేడఁగ నుద్యమింపదుగదా ప్రాణంబుతో నుండి యే
కరణిఁజూడఁగనోర్తు నోర్తుగద నా గర్భంబునంబుట్టెఁ గూఁ
తురు మున్నాళ్ళుపవాసమయ్యె ననుచుం దుఃఖించెఁ గన్నీరుబ
ట్టురలన్ వేశ్యల బూటకంబు లితరుల్ యోజింపఁగా నేర్తురే.

క. అదివిని కేశవరావునుఁ
బదఁబడి నీవింత చింతఁ బడకుము పాపా!

యద్ది యెంతటి వెలఁగలయది
పదులో నూఱులొకో తెలియఁ బల్కుమటన్నన్. 65

శా. అల్పార్ఘంబునఁ జేతఁ జేరునదిగా దల్లాట నేసీకడం
దెప్పింజాలక యూరకుంటిని మిముం దేతెమ్మనన్ శ్రీదులే
కల్పాగంబులె మీరు కాపురములం గాపాడఁగావద్దొ మీ
పాల్పే మాకును పాల్పు మీరు చెడ మమ్మింజూతురే? యేరనన్.

క. గొడ్డుదియును నాఁకఁట వెతఁ
బడ్డ జనునిఁజూచి మిగులఁ వగఁబొందుఁగదా
దుడ్డొలఁగన్నది యటుపై
బిడ్డను నిచ్చిన నెంత వెతనొందునొకో 67

క. మక్కువ నాకుం గలదని
కక్కురితిం జెందునది యుఁగాదిది యెంతో
పొక్కుచుఁ జెప్పఁగఁ సాఁగెన్
నిక్కంబుగ నూరకుంట నింద్యము నాకున్. 68

సీ. అనుపఁ దలపోయుచో జరద్వనిత పల్కు
నాసపడి యావుపొదుగెల్లఁ గోసినట్టి
చందమగు నిన్ను దానికిఁ జాలినంత
సొమ్ముఁ దెమ్మన నొకయుపాయమ్ము వినుము. 69

చ. అది యొక వేయిరొప్యముల యర్ఘ్యమునం దనరారుచుండు ము
ప్పది పదులైన రొక్కమును బట్టుక తెచ్చి యొసంగి తక్కుడె
బ్బదిపదులప్పుగొంటినని పత్రము వ్రాసి యొసంగుమయ్య నే
నది గిరవుంచి యొక్కయెడ నర్థము దెచ్చెద మాతమాపయిన్,

క. ఎఱిఁగియొ యెఱుఁగకొ యంటిన్
మఱియొక సంశయము మీరు మదినుంచకుఁడీ

కొంటెతధనము నాకుం జే
కుటమిం బత్రింబునిమ్ము(గోరక వలసెక. 71
మ. అకటా! యాతని లౌకికప్రతిభ యేమైపోయెనో వారనా
రికి లోనైన సమస్తముంజనును గూర్మిక దాని మంచంబు చెం
తకు వేవేగమె యేగి మమ్ము నిటులం దంటాల(బెట్టంగ నీ
కొక లాభంబటె లేచి చెప్పుమిదె నీయుల్లాసముం దీర్చెదక.
క. ఏమే హేమలతాంగీ!
యేమే! యామోదరుచిర హిమకరవక్త్రీ
యేమే! తామరసాక్షీ!
యేమే! మోము త్రిచూడ వేటికె యలుగక. 73
క. అన సమ్మద్దియ మెల్లన
స్తనతట విస్రస్త పటము సవరించుచు వీ
డిన కొప్పు ముడిచికొనుచుం
గినుక దనుకుచుండ నెట్టకేలకు లేచెక. 74
ఉ. లేచి యొకింత యూర్పులుచలింప(గవానిని(బుల్కుపుల్కునం
జూచి యిదేమియయ్య పలుసోద్దము నాతలనొప్పియెక్క(గా
నోచెల యేచసాగిరి ముహూర్తము నక శయనింపనియ్య రే
మీా చెవినేమొకో వినిచె మృత్యువు నాకిది తల్లిగాదుగా. 75
ఆ. మేన జబ్బువొడమె మీాకేల నాబాధ
యెనుట(బల్కుచుందు రింపుగాను
గన్ను మాటు వడిన(గావలెనే మీాకు
నాదుబాధమఱియు నాతలంపు. 76
ఆ. అనిన(బడఫుక త్తె కాత(డిట్లను జత్తో
బాధవలనమేని బాధ బొడము

నోముగల్గ నీకు నోము జెప్పఁగ నేల
నీవు నాఁగలుఁ జెల్పు నిశ్చయముగ. 77

చ. నినునెడబాసి నే క్షణము నిల్వఁగఁజాలను నామనంబు నా
ధనము న నాదు ప్రాణములు దప్పక సర్వము నీవె సుమ్మ నె
మ్మనమున నన్ను వేనియును మానక బాసయొసర్తుఁ జూడు మి
ట్లనక మనస్య భాషిత శరాహతిఁ గూల్చఁగ నీకు న్యాయమే

ఆ. ఇట్లు బల్కుచున్న యెమ్మెకానినిఁ జూచి
పడుపు పడఁతి మఱలఁ బలికె నన్ను
నడుగ నేల మీకు నడువ దే మాయమ్మ
యెఱిఁగియుండి యడుగుటేమి సొగసు. 79

ఆ. అంతఁ గాంతుఁ జింతి మంతనంబునఁ బల్కె
నింత పంత మింత వంత యేల
గాంత వింతగాను గాంతువె నా చెంత
నింత యంతరంగ చింత మాటి. 80

వ. అని యొక్క నాఁడు. 81

ఉ. తంత్రియు గర్భగేహమున దాచిన పేటికఁ జౌర్యవృత్తి నె
వ్వాండ్రును జూడకుండఁగ రవంబు జనింపకయుండ ధైర్యముం
దంత్రిల మాఱుతాళమునఁ దీసి శతత్రయ రౌప్యముల్ వశిం
గాంచ్రు యతంతుఁ దెచ్చి గణికామణి కప్పనసేసి వెండియున్.

క. పత్రంబును వేశ్యా జన
యిత్రికిఁ దనచేత వ్రాసియిచ్చి ధనంబున్
ద్విత్ర దినంబులలో నా
చిత్రాలంకారమునకుఁ జేర్చి యొసంగెన్. 83

వ. ఆవిస్త్రంబునం బంగ్రెండు వన్నెల మెఱుంగెక్కు రుక్మంబు
విలిచి నాడెంపుచేతం బ్రసిద్ధుండగు నొక్క నాడింధమునిచేత
నొక్కనాడును విడువక కొన్నిదినంబుల కాయాభరణంబు
జేయించి యిచ్చెం దదనంతరంబ. 84

చ. అదిమొదల గాసరోజముఖి యర్ఘ్యము పాద్యమునిచ్చుచుండి నె
మ్మదికి హితంబొనర్చు చుమమాటికినవ్వులుహాస్యవాక్యముల్
గొదుకక సల్పుచున్ మరులుకొల్పి యనేక విచిత్రభోగ సం
పదలను గొన్నినా ళ్ళతని భావముమెచ్చంగ వెక్కసేయుచున్.

మ. ఒకనాం డొక్క వసంతకాలమున నత్యుచ్చాగ్రమౌ మేడపై
నకలంకస్థితిం బండువెన్నెలలుగాయం జాపుల న్నిక్కుటాం
తిక వాటంబులు జల్లమల్లెవిరుల న్నింపైన పూసజ్జ నా
యకుండుండంగ నక్కుంజేరిమధురవ్యాహారముల్వల్కుచున్

క. నాకుంగల కొదువలెల్లన్
నీకడ వివరింపకుండ నేర్చెదనె ప్రియా !
వాకొందు ననుచుం గౌఁగిటఁ
జేకొని యమ్మధురవాణి చెప్పందొడంగున్. 87

ఉ. నాజనయిత్రి దుర్మతి ధనంబును బ్రాణము లంకెంజెట్టు నే
పూజ యొనర్చి దీనికని బుట్టితినో కద ప్రాణనాయకా !
రోజన నొక్కపైసయును రోయిడజాల దింకేమిసేతు నే
యోజ నభీష్టవస్తువుల నొందెదు సౌఖ్యము నాకుంగల్గలెదున్.

శా. ఆ శీతాంశుముఖిన్ వచించె నతండిట్లాలాగు సందేహమే
లా శోభావతి నేను గల్గంగ మనోలాల్యంబు వీడం దగుం
బైశాచ ప్రతిబంధ మోయన ననున్మాతండ్రి బాధించుంగా
కా శంకం బడకున్న నీగృహము నిష్టార్థంబుల న్నింపనే. 89

చ. దినదిన మొక్క రూప్యకము దెచ్చి యొసంగుదునంచుఁ జెప్పి వెం
ల్లినఁ దన తండ్రి మంచపు తలాపఁ గడంగల బీగమెత్తి కొ
ట్టునఁ గల ధాన్య మప్పుడపుడున్ వెలకిచ్చుచుఁ దద్ధనంబు న
వ్వనజముఖి శిరోమణికి నైశిక వేతన మిచ్చు శంకరా! 90

ఆ. ఇట్లు కొంతకాల మేగుచు నుండంగ
దైవయోగ మెట్లు దప్పవచ్చు
రామదాసు చేత మామయు గ్రస్తమై
సీత పూజ యనెడు పేరు మాసె. 91

సీ. జయ గంటలును తాళచయ మృదంగంబులు
విరిచి తాంబూలంపు వెలకు విచ్చి
పూజ సల్పెడు పాత్రములను బంధకముంచి
మేలి చీరలకని మెలఁత కొసఁగి
వెండి సంపుటములు వెఱుపక చెఱించి
కింకిణుల్ ముదితకుఁ గీలుకొల్పి
కనక విగ్రహములు గఱఁగించి దానికి
హస్తకంకణముల సమరఁ జేసి

గీ. కొమరుఁడీగతిఁ దండ్రి దేహమునఁ దెబ్బలు
పెఱుఁగు కొలఁదిని బీరంబుఁ దఱుఁగఁజేసె
కాముకులు మంచిచెడ్డలఁ గాంతు రెట్లు
గణిక నొకదేవతనుగాఁగ గణుతిసేసె. 92

క, అమలమతి రామదాసుం
గ్రమమున శిక్షించి యొక్కకాలము సీతా
రమణుని మదిలో నెంచుచు
నమర వర పుర ప్రయాణ మమరం జేసెన్. 93

ఆ. వారి భూరివిత్తహారి యించించుక
పొరలినంత పొరలిపోవుఁగాక
యుంక మందనిలను నేగతిం జేకూరు
దిట్టమైన యట్టి గట్టు విరిగె. 94

వ. ఇట్లు పితృవియోగంబైనలోకంబునకు వెఱవవలయు ననుచు
లేనిదుఃఖంబున నించుక చింతించి వెలిబెట్టుదురను భీతి నొల్లి
యొల్లముగా నౌర్ధ్వదైహికం బాచరించుచు నివాపంబులయో
డ నిదియేటికని చింతించుచు నట్టి దశరాత్ర మధ్యంబున
నొక్కనాఁడు.

చ. మది గనకాంగిపైఁ దగిలి మాఱిన వేసము గల్గి యుండుటం
జెసరిక యర్ధరాత్రమున భీకరసంతమసంబు తోడుగా
వెదకుచు వచ్చి దాని గృహవేదిక చెంగట నిల్చి మెల్లనం
గదిపెఁ గవాట మాజఁతి గ్రక్కునఁ దీసి వచించె నాతనికిఁ 96

క. ఇటు నేఁ బచ్చితమ్మా
కటకట! నీచేయు కర్మకాండంబెల్లం
దటుకునఁ జెడిపోకుండునె
కుటిలపుపనిఁ జేయ నెట్లు కోరికబుట్టెన్. 97

ఆ. ఇంటవెలఁదినైన నేనయ రీదినముల
వారవనిత పొందు వలతువ మఱి
యశుచినైన నిన్ను నంటంగ మాకంత
పాప భీతి లేదె పదుమ పదుము. 98

వ. అనిన నాతం డిట్లనియె. 99

ఉ. పొందునె యిట్టిప ల్కొకఁడు వాయిన నొక్కఁడు మైల నేగతిం
జెందును జెందెనేని పెనుచీఁకటి కైవశివచ్చి క్రమ్మె నే

హిందువు లిట్టి వెట్టఁబడి యేఁచెద రన్యుల కేల లేదొకో
కొందఱిమేను భూతములకూడికచే జనియింపలేదొకో. 100

ప. అనిన నదియు. 101

చ. పదపద యిట్టియుక్తులను బల్కకు కొందఱు లెల్పఁ గొంద ఱిం
పొదవుచునుండు నొప్పుగుచు నొక్కఁడు యోగ్యుఁడు నొక్కఁడుండుడు.
దుర్మదుఁడయియుట్లు ధర్మము లుపాఙుట తప్పకొ యుక్తు లేలనీ
సదనముఁ జెందు పొమ్మనినఁ జయ్యన నాతఁడు పోయె నింటికిన్.

గీ. పోయి యాతఁడు పదిరెండు ప్రొద్దులాత్మ
గట్టిగాఁ బట్టి వెడలించి యెట్టకేని
పడపుచెలి యింటికేగుచో బాదయుగముఁ
బట్టి కన్నీరు విడచుచుఁ బలికె లక్ష్మి 103

చ. నిమిసము కోపగించకుఁడు నేనొక విన్నప మాచరింతు స
క్రమమిది మానమేనియును గాదు మహత్తరులైన తండ్రిగా
రమరుల వీటికిం జనిరి హాయన దీక్షయొనర్చువారు స్వ
ప్రమదను గూడకుందురఁట వారవఘాటుల పొందుయుక్తమే.

ఆ. పెద్దలున్నయప్పుడు పిన్నవారలు మీరు
వారలిప్పుడు దూరమైరి గాన
నింటి కార్యతతుల హెచ్చైన కీర్తులఁ
బడయవలయు జన్మఫలము గాదె. 105

క. అన దండతాడితంబగు
ఘనతర కాలాహిపగిదిఁ గనలుచు సాధ్వీం
గనుఁగొని నాకడ నీవే
వెనుదీయక ధర్మములను వినుపింతువహా! 106

చ. వెఱపోక యింతలేక పదవిన్ నను నష్టము దాకి ధర్మముల్
గఱపుచుఁ బ్రేలసాఁగితివి కావాన్గొ పైదలివంచు దంతముల్
గొఱుకుచు నాకు నిట్టి పలుకుల్ గొఱగావనితూలఁబల్కుచుం
జఱచుఱఁజూచి బెత్తమునఁ జుఱ్ఱున వీపున వైచె నాసతిన్. 107

స. ఇట్లు నైచిన శివశివా యని మఱలి యత్తకైనం జెప్పక గృ
హంబు నందుండి భర్తకుం బూర్వరీతి శుశ్రూషఁజేయుచుండె
నాతండు గడనకత్తె యింటికింబోయి దాని యడిగిన సొమ్ము
లెల్ల నిన్నిరోధంబుగ నిచ్చుచుం దదేకాయత్త చిత్తుండై
యుండునంత. 108

ఉ. చెంగటివేశ్య కల్ల విటశేఖరుఁడిచ్చెను బ్రేనుమీఱని
స్సంగను గొమ్మటంచును బనారసుచీర యొకండు దెచ్చి వా
రాంగన యెట్టులుండెనని యాఁగద లెస్సయటం చతండనం
గొంగునఁగొట్టి తీర్చితివి కోరిక నంచధరంబు వంచుచున్. 109

క. నీపాటి నాణెమెఱుఁగుదు
నోపిన వెలఁజెప్పుమనుచు నొకవంద పయిన్
రూపాయ లేఁబది యనఁగ
నోపుదు వెన్నెని యిట్టి యుక్తులు సెప్పన్. 110

గీ. అనిన నగి యింత గీర్వాణమూడ నేల
గావలయు నిట్టిదని తెల్పఁగా వలవదె
యనుచు నమ్మాద్రి తప్పక యనువుమీఱు
చీరఁ గొని తెచ్చి యిచ్చె సింగారవతికి. 111

సీ. ఒకనాఁడు తీర్థంబునకు బంపవే యన
బాయక నూఱు రూపాయలిచ్చుఁ
బండుగవచ్చె నెబ్భంగి సాఁగునటన్నఁ

బాయక నూఱు రూపాయలిచ్చు
బంధు గృహంబునఁ బరిణయంబని చెప్పఁ
బాయక నూఱు రూపాయలిచ్చు
మ్రొక్కుకొంటిని స్వామి కొక్కనాఁడని పల్కఁ
బాయక నూఱు రూపాయలిచ్చు

గీ. అవికలకు నంచుఁ జెవి కెంపు టాలకంచు
నత్తరులకంచు మెత్తని మెత్త కనుచు
దిండులకునంచుఁ బన్నీరు గిండికనుచు
వాని సొమ్మెల్ల రాఁబట్టె వారవనిత. 112

క. కనకాంగి కాముకునితో
ననుకూలత నొక్క గేహమందుండఁగఁ బ్ర
క్కన యంగణంబునం ద
జ్జననియుఁ బ్రస్తావనా వశంబున నంతన్. 113

గీ. కేశవుని వీనులందు సోకింపఁ దలఁచి
ప్రాతివేశినతో నిట్లు బల్కసాఁగె
నప్పు చూచితె కలవాని యొప్పులెల్ల
మొన్న మొన్నటి కుఱ్ఱది యెన్ని నేర్చె. 114

శా. దాసిం బ్లీడరుగారొకానొకరు చేతంబట్టి రానేరుపే
మో నానాటను దీవఁబూచినక్రియన్ ముత్యాల రత్నాల నిం
పౌ నానావిధ భూషణంబులను దేహంబెల్ల నిండెన్సుమీ
దీనారంబులపెట్టెగాదె యది ఖ్యాతింజెందె నిప్పేఁటిలోన్. 115

చ. చదువుల నెంత నేర్చినను జక్కఁదనంబది యెంతగల్గినన్
మొదటను వారనారులకు ముఖ్యముగాఁ జతురత్వమున్నఁబో

మదకు నదృష్ట మాపయునిఁ దోడగు సంతతి ప్రౌఢిమంబు తే
మదవతికబ్బె నెంత పలుమానిసినైనను వంచునింతయున్. 116

క. అక్కరో దానికిఁ గల్గిన
చక్కదనం బెంత దాని సౌరెంతటిదా
నొక్కపరిఁ జూచి దానికి
మిక్కిలి రొక్కంబులీక మిగులునె యెవఁడున్. 117

సీ. ఇట్టె వచ్చిన యట్టి యింజనీయరొకండు
మేలైన యద్దాల మేడఁగట్టె
నున్నట్టి యుండంగ నోవరుసీయరు
వేరైన కాసులపేరులిచ్చె
నిన్న మొన్ననువచ్చి యున్నయక్కౌంటరు
బాగా బనారసు బట్టలిచ్చె
సరసంబు నొత్తూరి సల్పినాజరుగారు
పది యుంగరంబులు గోదుకకిచ్చె

గీ. గడనకత్తె యనంగ నప్పుడఁత్తి గాక
యున్నవారల పేళ్ళని యూరునేమి
యింతటిదిగాక యున్న చౌదంత్రి యొకతె
పల్లవ మొకర్తు మిక్కిలి ప్రౌఢసుమ్ము. 118

క. నాకుం గల దొక తనయ వి
వేకము నొక యింతయైన నెఱుఁగలది గా
దే కరణిఁ బ్రదుక నేర్చునొ
నాకాలంబెట్లు గడిపినానో యెఱుఁగవే. 119

ఉ. మంచిగుణంబునం బఱగు మానిసి కేశవరావు తన్నుఁ గా
పించెను గాన వాని మదికెక్కుచుచో సరసంబులం గఱం

గించి యనుగ్రహంబతనికిం గావించిన ముందువెన్కకుం
గాంచెడువాఁడుగాఁడుతన కాంక్షితముల్ సమకూర్చుకుందు నే.

మ. అని నామాటలు వీనులం దవులఁగా నాకేశవుం డాక్షలో
ననుమానించుచు వీరికెన్నఁగను నేనన్యాయముం జేయుచుం
టినె ద్రవ్యంబును గోరినంత గురు రెట్టింపుగ సమర్పించుచుం
టిని గాదే యిఁకవీరికిం దనివి బుట్టింపంగ నాశక్యమే. 121

సీ. అజ్జమ్మ ముండ్లగుం పావరించినయట్లు
పనసపంటికిఁ జర్మ మొనసినట్లు
రత్నంబుపైఁ బొరద్రాకినవిధమున
ముత్తెంబుపై గబ్బు మెత్తినట్లు
టెంకాయపైఁ [illegible]బెచ్చు లంటించియున్నట్లు
నీట శైవాలంబు నిలచినట్లు
కస్తూరిపైఁ దిత్తి గ్రమ్మిన పోలిక
మట్టిపై భూతంబు మఱిగినట్లు

గీ. వారకామిని యను భోగ్యవస్తువులను
వృద్ధమాతయనందగు పెద్ద పెడుగు
నిచ్చలునుగాచి యుండంగ హెచ్చుబూను
కోడెకాండ్రకు వేడ్కచేకూరఁగలదె. 122

క. కొదువ యొసంగితి భూములు
సదనమునం గల్గు వస్తుచయము సుమ్మితి నా
సుదతి స్వమంగళసూత్రము
తుదగాఁగల తొడవులెల్ల దోఁచి రెటుసఁగిలఁ. 123

శా. కోశంబెల్లను వీరికిచ్చితిని సంకోచంబు లేకుండ నా
కాశంబంతటి నోరుసాపి తుదకుం గైబట్ట నమ్మింగఁగా

నాశం జెందుచునుండె నిపుటి యుపాయంబెద్దియగా సర్వముఁ
నాశం బందిన నెచ్చెలి న్విడుట ప్రాణత్యాగమై తోఁచెడుఁ.

ఆ. అదియుఁగాక తనకుఁ బడిలక్ష లబ్బిన
వన్నె నమ్మియుండె నన్నుఁ దాఁగి
దీని విడువఁ బ్రకన్న ప్రాణంబు విడుచుట
మంచి కార్యమనుచు మదినిఁ దోఁచు. 125.

క. కాకున్న స్మృతియొకనిం
జేకొన్నం దీని కెంత సిరియబ్బునొకో
నాకన్న గతినుఁ జెన్వం
దీకన్న న్యసువాసంగ జేయుచు నుంటిఁగా. 126

వ. అని యిట్లు తలపోయుచు నత్తరుణుండు తన యింటంగల విత్తంబు తగ్గుటం జేసి యోగి తగ్గిన నందువలన నప్పుడప్పు చేసి యలక్ష్మిం దనయందు గౌరవంబు తగ్గుచుండెనని తలంచె నట్టి యిన నాతనికిం గనకాంగిపై యనురాగంబున కించుకయుం గొఱంతలేక సంచరించుచుండ నంత నొక్కనాఁడు. 127

చ. ఇరువురు నొక్కశయ్యపయి నేకతమ్మున వసించియుండ్ ద
త్కర సరసీజ మాత్మకర తామరసంబునఁ బూని యింత్తి య
త్తరుణుని నవ్వుటాలకును దారిచి మెల్లన వాని వ్రేలి యుం
గరమును దీసి నీకరము గాటమొ నాదు కరంబు గాటమో. 128

ఉ. కాంచెద వంచు నైజకర కంజ కనిష్ఠిక యందు నవ్వుతో
నుంచి తదంగుళీయకము నో ప్రియవల్లభ నీదు హస్తముఁ
మించెను నాకరంబనుచు మేలము లాడుచు నన్యముం బ్రసం
గించఁ దొడంగె నాతఁడును గిమ్మనఁడాయె శశాంకశేఖరా.

మ. సరిగంచుల్గల ఖండువా నొకపుడంస ద్వంద్వముం జేర్చి యా
సరసుం డత్యనురక్తుఁడై చలించునతి జంచచ్చంచరీకాక్షి త
త్కూర వారాలంబముగాఁగ దో నరిగి చిక్కంబట్టియమ్మోలి యు
త్తరచేలంబును మెల్లనం బయటగాఁ దారించి దబ్బాటుగన్.

క. అయ్యుత్తరీయ మాతఁడు
చయ్యన నపహరించుకొనఁగ సాఁగిన సహహా!
వయ్యారి లాగుచు నాతో
నయ్యాటలమూఁలాఁడు ఏమి సాహసమనినన్. 131

క. ఔరా! యీచాతుర్యం
బే రామలయందుఁ గంటి నేమొకో యిస్సీ!
వారాంగనతోఁ గూడని
వా రారణ్యకులుగాక వైభవయుతులే? 132

గీ. అనుచుఁ దలపోయసాఁగె మహాత్ముఁడతఁడు
పక్షులెత్తుకపోయెఁ బై బట్టయనెడు
కలి పేరుకొని నంచును గ్రీడఁజెందఁ
గారె కామాంధులకుఁ గాంచనాని యొకటి. 133

క. ఆకరణి సర్వధనముం
బోకార్చి యాతని గృహబహిష్కుం జేసెన్
శోకించి రింట నన్నముఁ
గోరయు నలవడక తల్లి గులసతియుఁ గడున్. 134

ఉ. ఎంతటి భోగసంపదల నెంతప్రతిష్టల గంటిమయ్యరో
యింత యొసంగ నన్నియును బ్రేల్మిడిపెల్మిడియయ్యె దైవమా
యెంతయొ సత్యమయ్యెను భవచ్చరితంబున కద్దుగల్గునే
యంతత నొక్కరీతిఁ గడసాఁగుని యెంతటి మంచివారికిన్. 135

## గద్య.

ఇది శ్రీమన్మంత్రి ప్రెగడ వంశ పయఃపారావార రాకాసుధాకార
రాజబిరుదాంకిత భుజంగరాయామాత్య పౌత్ర హారితస గోత్ర
పవిత్ర దుర్గామల్లికార్జున ప్రసాదరాయ వరపుత్త్రి శ్రీమా
ర్కండేయ వర ప్రసాదజనిత కవితాధౌరేయ బుధ
జనవిధేయ భుజంగరాయనామధేయ ప్రణీతం
బైన వారకాంతయను చాటుప్రబంధంబు
నందుఁ దృతీయవిలాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

84

శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః

# వారకాంత

## చతుర్థవిలాసము.

క. శ్రీ మార్కండేయేశ్వర
వ్యోమాశుగ వహ్ని శంబరోర్వీదిన రా
ట్సోమ యజమాన మూర్తీ
ధీ మజ్జన వినుత దేవ దేవ మహేశా! 1

గీ. అవధరింపుము పైకథ హర్షమెసఁగ
రామదాస సుతుండిటు కామవృత్తిఁ
ధనము సర్వస్వమును భోగ వనితపరముఁ
జేసి సంసృతికై గాసిఁ జెందుచుండ. 2

ఉ. ఇంగిత చేష్టలంగని మనీషితుఁడం బటు బుద్ధిశాలియా
సంగతికాఁడు లోకం జెడదగ జాలి జనింపఁగ వాని కిట్లనున్
భంగము రాకయుండఁగ నుపాయము జెప్పెదనోయి మిత్రమా
వెంగలివాఁడు మించినది వేమరుఁ ద్రవ్వఁగఁబోకు మెప్పుడున్

ఉ. చేసిన దేమొ చేసి తదిచెల్లుగఁజేయుచు నిప్పుడైన నా
దోసపు లొత్తుపైని మది ద్రొక్కఁగనీయక నాదు పల్కులం
బూసలు గ్రుచ్చినట్లు మదిబాందిరసేయుము నీకు నీపయిన్
వాసియు వన్నెయుంగలుగు బంధుజనంబులు మెత్తురెంతయున్

శా. ప్యాసైయుంటివి రెండుమూఁడగుపరీక్షాంశంబులం బుద్ధియున్
భాసించున్ విశదంబుగా మిగుల సంభావింతు రుద్యోగులున్
వాసిన్ నిన్నిత్ప్రగౌరవంబున వృథా వ్యాపారముల్గాని యా
యాసంబుం బడఁబోక నొక్కపనికై యత్నంబుఁ గావింపుమా

క. అఁకఁటఁ గుందిరి తల్లియు
నా కులకాంతయును మిగుల నాకులపడుచున్
నీకది శ్రేయంబగునే
యేకరణినో యింత యన్నమిడఁదగుఁ గాదే. 6

శా. అన్నం గేశవరావు నాహితుని సల్కాలించి చింతించు లో
నన్నాయన్నలినాక్షి వీసమనె వీఁడకార్యముం జక్క నే
మన్నం జేసెద దాని వీక్షిన యెడన్ వ్యాపారమింకేల నా
కన్నం జేటికిఁ జుట్టలేటికిఁ దుదం బ్రాణంబు లింకేటికిన్. 7

గీ. అయిన నీతనితోడఁ గాదనఁగ నేల
యట్లు చేసెదనని వీని నంపి మఱలఁ
జేయుపని మాన నన్నేమి సేయు నీతఁ
డనుచు నుద్యోగ వాంఛతో నతని కనియె. ౮

మ. చనువుండుం బలునాళ్ళనుండియు సిరస్తాదారుతో నాకు ని
ష్ఠానరంగా దరఖాస్తుఁ జేయ నొక యుద్యోగంబు నీకుండు నీ
మును మాతండ్రినిఁ జూచి గౌరవమునం బూజించు నస్తాద్నే
యనుమానం బొకయింత లేదు పని నాకైనట్లుగా నమ్ముమీ.

క. ప్రస్తుతముఁ జూతుననుచున్
నేస్తము గల వాని ననిచి నిపుణతఁ గార్య

ప్రస్తావనఁ జేయంగ సి
రస్తాదారు కపటేగి రయముగనఁ బలికెన్. 10

వ. అనంతరం బా సిరస్తాదారుండును వీని యవస్థకుం గటకటంబడి
దైవగతి కబ్బురంబు నందుచుం బుణ్యావశంబున నిరువది రూ-
పాయల నెల సంబళంబుగల యొక వ్యాపారం బవకాశంబుగ
టంజేసి యది కేశవరావున కిప్పించెం దదనంతరంబున. 11

చ. అది మొదలాపని నిపుణుఁడై నెరవేర్చుచు వచ్చుసొమ్ములోఁ
బడి తన యింటిఖర్చుకని పారఁగవైచుచుఁ దల్లిచేతిలోఁ
బడి వెలయాలికిచ్చుచును వారలు దన్నును జాలఁ జేయఁగా
వవలక దానియింటికిని వచ్చుచుఁ బోవుచునుండె నిచ్చలున్.

సీ. ఈవేళ బిడ్డకం బెనయుచునుండె నీ
యిల్లాలి చెంతకు నేగుమనుచు
నీవిచ్చు నీవికి నీనాటికింతయొ
చాలుఁ జాలును సరసంబులనుచు
వచ్చెను నడమీఁగవలె నంచు నణఁగుచుఁ
బెళపెళయన నెటికలను విరుచు
నొక్కనితోఁ గూడియుండిన మాకింకఁ
గడుపు నిండదనటంచుఁ గసలుచుండు.

ఆ. నిన్ని యేమనింపు లెనయుచునుండియు
దాని యిల్లు విడుతునేని యింక
నిశ్చయముగ మేన నిల్వవు ప్రాణంబు
లనుచు నెంచు నాతఁ డబ్బురంబు. 12

గీ. కేశవుని తల్లి మిగుల దుఃఖించి యకట
వీఁడు దుశ్చేష్ట లిప్పుడును వీడకుండె

గామించు నారిఁ జెలువం
బామలతోఁ జెలిమి వార భామల పొందున్. 20

గీ. అనిన నాపల్కులకును మాఱాడలేక
శిరము లొక్కింత వంచుచు సిగ్గు గదురఁ
దస్కరుని పోల్కెఁ బాదముల్ ధరణియందు
నల్లనల్లన జరుపుచు నవలఁ జనియె. 21

క. తల్లి వచించిన పల్కుల
నుల్లంబున మఱల మఱల నూహించి కడుం
దల్లడపడుచుం జడిసిన
దెల్లం దలపోసి కుందె నేకత నూఁకన్. 22

మ. నను నారాయణశాస్త్రి యింతవఱఁ జెండంజేసెనిక్కార్యమం
దు నపాయంబొనగూడునంచు మదిలోనేఁ జెందుదం దానియా
వన మాచక్కఁదనంబు నానలుపు లావాల్గాపు ల్ప్రౌఢిమం
బును నన్నిట్టుగ మత్తుమింపులక్రియన్ మోసంబునొందింపదే

సీ. ఒకనాఁడు వీణ పాటకు మది సొక్కించి
చేతి రొక్కంబెల్లఁ జేరఁదీసె
వివిధ భోగంబుల వివశత నొందించి
యొకనాఁడు మాన్యంబు నొడిసి కొనియె
దాఁ జొచ్చి యొకనాఁడు పరిహాస మత్త
నుండంగ ముఁగగుల నూడలాఁగె
వ్యజనంబు నొకనాఁడు హాయిగా విసరుచు
మగసాల తమ్మెట్ల మాటికొనియె

గీ. నుత్తరీయంబు కొంగున నొక్కనాఁడు
ముడిచి యున్నట్టికాసులు మోహపెట్టె

బునకుం గ్రామాంతరమున కుండుటం జేసి వారి యుద్దేశంబు
నెరవేరదయ్యెం గావున 38

సీ. ఆయత విత్తవంతుఁడు యశోధికుఁడు న్సకలాధికారియుఁ
నాయఁడుగారు నీవలయు సుమంబుగఁ గామమునగ్గి వార్తం
బాయని వేడ్కఁ బెంపె మనభాగ్యమిఁ కేమని చెప్పవచ్చు నా
రాయణశాస్త్రి నంత రయంబునవచ్చు నటంచుఁ జెప్పినన్.

క. ఆ స్త్రీ రత్నం బతనికి
శాస్త్రిం బిలువంగఁ బంచి చాతుర్యమునన్
వస్త్రాది భూషలన్ మరు
శస్త్రిం గఁ గన్నుగవను సన్మద మొసఁగెన్. 40

చ. జలజలలాడు పెన్నెరుల సంపఁగినూనె మెఱుంగువెట్టి బల్
కలకలలాడు సోఁగయగు కన్నవఁగాటుక దిద్ది నిద్దమై
మిలమిలలాడు రంగుపని మించెడి పావడఁగట్టి దానిపైఁ
దలతలలాడు నొక్క జలతారు బనారసు పైటఁ వేప్పఁగన్.

క. అయ్యింతిఁ జూచు వేడుక
నయ్యుద్యోగస్థుఁ డధిక హర్షంబమరం
దియ్యవిలుకాఁడు దరుమం
జయ్యనఁ జయ్యనన జంగఁ జూచుచు నడచెన్. 42

శా. ఈలీలం జనుదేరి నాయఁడపుడా హేలావతిం జూచుచున్
బాలారత్నముతోడ నేవిధమునన్ భాషించెనో దాని ప్ర
శ్నాలాపంబుల కేమి యుత్తరము దానందిచ్చెనో దానితో
నేలీలన్విహరించెనో యెఱుఁగఁ డాయెం జిత్రమా నెంచగన్.

మ. పవలుద్యోగపు కార్యము ల్వడివడిం బాటించిన న్సారసైం
ధవము ల్మందగతిం జరించుననుచుం దర్శించు నా భామతో

నవహేలాకృతి మందమందకృతులన్ వర్తించినన్ రేయి తా
నవలీలం జనునంచు నెంచునట నాయం డద్భుత ప్రక్రియన్.

క. పలుమాఱు నాయఁ డీగతి
లలనారత్నంబుతో విలాసము సలుపన్
వెలవెల బారుచు మదిలో
నలకేశవరావు చింత నంటం దొడఁగెన్. 45

ఉ. సొమ్మునఁ బాలుద్రావితుడ సొమ్మున గ్రుద్దుదు రెన్నిభంగులన్
నమ్మఁగరాదు వారలలనామణులన్ మును దండ్రి చెప్పె మా
యమ్మయు నింటిబంధువులు నాప్తులుఁ జెప్పుచునుండి రిన్నియున్
సమ్మతిఁ జేయనైతి నవి సత్యములై కనవచ్చె నీయెడన్. 46

గీ. బ్రాహ్మణునిఁగాని పొందనన్ బలుకువాయెఁ
గులసతికిఁబోలె భర్త నాకును నొకండ
యనుచుమునుపల్కులెల్ల సున్నయయ్యెను దలంప
నిన్ను విడఁజాలననుమాట నీటఁగలసె. 47

క. అంతటి సంసారము నా
కింతటి వచ్చె దీని నెనయుటచే నీ
చెంతకుఁ బోయిన వానిం
బంతంబున నెవరు పట్టిపల్లార్చిరొకో? 48

చ. గతమున కీగతిన్ వగవఁ గార్యముగల్గునె నాకు దీనిపై
మఱి విడకుండె నిప్పుడును మానఁగఁజాలను దీనిపొందు నా
కితర వధూటు లప్సరసలేనియుఁ జిత్తమునందుఁ బట్టరా
చతురత యావిలాసములు నామృదురూపము నెందుగల్గునే.

ఉ. ఎంతటివారు కోరినను నన్ని ధనంబులనిచ్చిరని యా
మంతయు వారిపైని మనసంటిన కూరిమి గల్గనేర ద

గీ. బలువురీ యింతినాశ్రయింపఁగఁ దోషఁగిరి
కలికి కినుకకునై గజగజనడఁకిరి
చాన చాతుర్య మగ్గింప సాగిరపుడు
దాని గర్వంబు వర్ణింపఁ దరమె శర్వ. 71

క. రోవెలఁదికి నెంజీకముఁ
గావించెం గేశవాఖ్య కరణిన్ సర్వం
బీవేయనఁ డదియధికం
బీవేయన దతఁడుఁజెందఁ డీవేమకయున్. 72

క. ఈ కరణి నుండ నచ్చట
నాకేశపుఁడాటె వార మష్టమ దినమం
దేకాక నడుమ నడుమన్
రాకుండె నిదేమి యనుచు రగులుచు నుండెన్. 73

సీ. నీలముల్ శుద్ధమై వాలము ల్వాడవిల్తు
జాలముల్ముంగురు ల్కాంమంటఁ
జెండులై బంగరు గిండులై దానిమ్మ
పండులై గుబ్బ పాలిండులదరఁ
దూఁపులో మన్మథుపాశిఖులో యెలదేఁటి
రూపులో యనఁగ వాల్జూపులమరఁ
దారమై నిల్చి సింగారమై పూవిల్తు
సారమై సుందరాకారమొప్ప

గీ. నడు గడుగునందుఁ దడఁబడి బెడఁగుఁజూపఁ
గిలకిలను నవ్వు మొలకలు వలఁపుఁ గెలుప
వచ్చి యచ్చెలి మెచ్చుచు హెచ్చి గ్రుచ్చి
కౌఁగలించెడి భాగ్యంబుఁ గంటినెప్పుడు. 74

క. చుఱుకు కుఱుక్కన మోవిం
గొఱుకంగ నీకింత దురుసు గూడునె యనుచుం
గొఱకొఱ లాడుచు నంతనె
మఱిమఱి నన్ గౌఁగలించు మానిని నెంతున్. 75

సీ. ఆవేళఁ బూఁదోఁట యంబరు గాడ్పులు వీవ
సౌధతలంబున సంచరించె
నానాఁడు మధురోక్తు లాడుచు సరసను
గుదురైన గద్దెపైఁ గూరుచుండె
నా పొద్దునను దలయంటి నీరారఁగఁ
జెలఁగాడుచును సోగనెఱులు విప్పె
నా సముఖంబున సంతసంబుగా వీణ
మీటుచు గళమున బాటఁ బాడె
గీ. అప్పు డీచర్యలెల్లను నమృతమయ్యె
నిపుడు మదిలోనఁ బొడకట్టి యేచుచుండె
విసము పోలిక నేమియు వెరవుదోప
దేమిసేయుదుఁ బ్రాణంబు లెట్టునిలచు. 76

క. నాభాగ్యము నాముల్లియు
నాభవ్య తపఃఫలంబు నా పుణ్యంబున్
నాభూరిరాశి యహహా!
శోభావతి వయసతండు చూఱం గొనియెన్. 77

గీ. ఉవిదతోఁ బొందు నాకు లేకుండెనేని
గ్రామమున నున్న నిత్యముఁ గనుచుఁగొంతు
దూరమున నైచె వాఁడతి క్రూరుఁడగుచు
ననుచేఁ దలపోసి వెగడుందు ననుదినంబు. 78

సీ. సారంగమో మత్తసారంగమో కాదె
యతివకుఁ జూపులు యానములును
మాకందమో శ్రీరమాకందమో కాక
విమలాంగి పల్కులు వీనుగవయు
వాలంబులో ఘేనువాలంబులోయూను
చానకుఁ బెన్నెరుల్ జంఘులగయు
సరములో తారావిసరములో కావచ్చు
నలినాక్షి బాహువుల్ నఖరములును
గీ. అనుచు వర్ణింపఁ దగినట్టి హంసయాన
స్వప్నముననైన మరువంగఁ జాలకుంటి
నెవరితోఁ జెప్పికొనియెద నేను సేతు
సమయమును వేచి యేచఁగ సాఁగె మరుఁడు 79

ఇవ్విధమున నొక వత్సర
మవ్వసితకు గురుఁడు లాభ మందు పసించెం
జవ్వన ద్వాదశ రాశికి
వవ్వారసం జేరకుండునా తలపోయన్. 80

కు. ప్రకటం బొప్పఁగ భానువాసరముపర్ణభర్మాంగిఁబొందంగఁద
ప్పక యాకేశవరావు వచ్చు ననుచుం జల్మాలువాదంబుతో
నొక కర్ణేజపుఁ డాప్తుఁడై తెలుపఁగా హుంకారముంజేసి నా
యకుఁ డారాతిరి గద్దరించి పిలచెన్ ద్వారంబుచెంత జెలిన్.

క. పిలచినఁ గేశవు నపుడొక
తలుపు వెనుక డాఁచి సరగ ద్వారముఁ దెరువన్
నలు ప్రక్క లరసి నాయఁడు
చెలువయకం డెవ్వఁడొక్కొ చెప్పుమటన్నన్. 81

శా. అయ్యా యెన్నఁడు రానివాఁడితఁడు నేఁడావిస్ఫారరంటం
చియ్యారం జెలికాండ్రజూమటకునై యేతెంచినాఁడింటను
న్నెయ్యంబుండుటఁ జూచిపోవఁదలఁచెన్ నేఁడేవసింబోవువాఁ
డయ్యెం గావున రాత్రవచ్చెననఁగా నాతండు కోపంబునన్.

చ. పటపటఁ బండ్లు దీటుపుచు భానుదినంబున నీకు స్వవ్రతం
బటె యుదితోత్త! దుష్టవెలయాండ్రకు నీతియు జాతిఁ గల్గునే
యటులిటు లాదరించితిఁగదా యదియంతయుఁ గాలిఁబోయెనే
పటు విభవంబుఁ గుక్కకిడఁ బైఁజని యాఁకలు నాకకుండునే.

ఉ. బాఁపఁడ పంచు నీవు పనిఁబట్టక యుంచితి నిన్నినాళ్లు మూ
ర్ఖా! పలుగాకి! నీదగు మకాముపిడన్ సెలవెవ్వఁడిచ్చె నీ
లోపము తెల్ల నోరుచుట లొంగకయుంటివి మీరు స్వేచ్ఛగా
నీపయి నుండవచ్చునన నింతియుఁ బాపముఁ బల్కరంతటన్.

గీ. తప్పొనరింపని దండన
మొప్పగునే మీరు కోపమునుగుఁడు మీరే
తప్పు సహించనివెడ మే
మెప్పగిదిన్నిల్వవచ్చు నెంచుఁడటన్నన్. 86

ఉ. జీతము వృద్ధిఁ జేసితిని చీమఁగ నీ మన తప్పులెన్ని యు
న్నోర్చి తలపోయకుంటిని మునుపున్నది నేఁడెపడఁ జూతునేనియున్
నాతరమే మఱల్చుటకు నాకును నీజనకుండు మిత్రుఁడం
చీ తఱి నోర్చి యుంటనని యేగె నతండు స్వగేహసీమకున్.

ఉ. అప్పురుషస్వభావుఁడు దయామతి దూరముఁ జూచువాఁడునై
యిప్పగిదిన్ సహించనని యెంచఁగవచ్చునె నిశ్చయంబుగా
నొప్పుల కుప్పనై నతని కులదైవము రాగము వాని చిత్తముం
జప్పునఁ ద్రిప్పె నేర్పుగల సారథి దుష్టహయంబునుంబలెన్.

ఆ. అతివయందుఁగల్గు ననురాగ మతనికిం
బూర్వ మార్గముననె పోదలుఁగాని
రాచకార్యములను రమణి కిచ్ఛాగతి
జేయఁడయ్యె మనసు చెదరు కతన. [illegible]

చ. అరఁగుఁ బ్రశ్నఁ గానఁబడ రాశ్రితులెవ్వరు లంచమిచ్చువాఁ
డటుదయి తోఁచుచుండె వినయంబున మాటవచించువారలుం
దొరకకయుండి రచ్చెలికిఁ దొత్తునకున్ సిచమెత్తిసేని యుం
బరగగ మ్రొక్క దప్పదని పాటియొనర్చిరి పూర్వమార్గియన్

క. ఆతండాసఁగుచు నుండెను
జీతముగా కొక్క గన్య చేతంబడమిన్
నాతకి నాయఁడు భారం
బైతోఁచెం బరులరాక కడ్డం బగుటన్ 91

ఉ. మానక యుండెఁ గేశవుఁడు మానిని యింటికి రాకపోకల
సానియు నాతని న్విడువఁ జాలకయుండె ధనంబుపై రుచిం
బూనిన యట్టి పంచశర భూతముఁద్రోయఁగ నట్టియాజ్ఞయున్
లేని దినంబునందు రమణీమణి చెంతకు వచ్చియుండఁగన్. 92

ఉ. దైవ విధాన మెవ్వరికిఁ దప్పఁగ శక్యమె నాయఁడంతలో
నే విధినో యవేళఁ జెలి యింటికి వచ్చి హఠాద్గతిం గనెం
దీవియబోడిఁ గేశవునిఁ దెల్లముగా నపుడెన్నిభంగులం
బ్రోవుమటన్న నిల్వక గిరుక్కున మళ్లె మహాగ్రహంబునన్.

ఉ. చేతఁ గలంబు గొంట యవశిష్టముగాఁగఁ దలంచి యప్పుడా
రాతిరి వేళ బత్తరపు వ్రాసి నిశాంతముగాక మున్నె య
త్యాతత వృత్తిఁ గేశవున కంచి తదాదిగ నెన్నఁడేనియున్
రోలెజీవం గనుంగొనుట రోఁతయటంచుఁదలంచెనాత్మలోఁ

గీ. నాటి నుండఁ గేహవృందమును నాయకుండు
విడుచుచునుండెను నుంకువ లుడిగెఁ గానఁ
బెట్టిలో విత్తములు వ్యయపెట్టుటకును
జేయఁ సాఁగక యుండె నచ్చెలువ కపుడు. 96

ఉ. ఆఁకొని యున్నయట్టి నరుఁ డంబలియైనియు గంజియైనియుం
బాకముగాసి దేని యలవడ్డయెడం దినఁ గోరు పోల్కఁగా
నాకలకంతయున్ వసుసమార్జన తృప్తి జనింపకుండుటం
గోక యొసంగువానికినిఁ గోరికఁ దీర్చెఁ గ్రమక్రమంబునన్.

క. హేమాంగీమణి నిద్దపు
మోహాపైసం జూతమనుచు ముచ్చటపడు వా
రాముద్దియ గృహమునకున్
వేమారు న్వచ్చిపోవు విటులైరహహా. 97

మ. నరజన్మంబునఁ బుట్టి నట్టి ఫల మా నారీమణీ వాక్సుధా
సరసీ బిందు కణంబుఁ గర్ణముల నాస్వాదించు నాభాగ్యముం
దొరకన్ ధన్యులవారమంచు మదిలోఁ జూగాఁడువారెల్లరుం
బరిహాసోక్తులఁ బల్కునట్టి విలసత్రాపేణ్యులై రంతికిన్. 98

మ. జడుపొప్పం గడకంటఁ గాంచుచు మదిన్ సందిగ్ధతా వారలే
వడిగా వచ్చి సరోజనేత్ర కదియా వాక్రువ్వఁగా నంతనా
నుడికిన్ మాటున్నడి నెంచియెంచి నుడువ న్లాడుచున్ నవ్వుచున్
జడవచ్చోటనె యుండ సాఁగిరహహా తద్బద్ధ చేతస్కులై. 99

సీ. ఎడకాండ్రుగావచ్చి గుడగుడ లాడుచు
సతివతోఁ బరిహాసమాడువాడు
ఘల్లుఘల్లు మనంగఁ గరమున రూప్యంబు
లెగరవేయుచునుండు సొగసుకాండ్రు

ఒక్క నిద్రకు నెంతయుంకువ గ్గొనను
నెన్నకిచ్చెదవను పన్నె కాండ్రు
తామరసాక్షిరో నామాట కేమి యు
త్తరమని పలుమరు నడుగువారు
గీ. సంతకూటముగాఁ గూడి యింతి యింట
హర్మ్యతలమునఁ గొందఱు నంగణంబు
నందు గొందఱు నడవిభాగమున గొంద
ఱాకులంబుగ నుండ్రు విహార్నిశంబు 100
క. ఆచాతుర్యం బేమన
వాచాగమ్యంబు గాఁడు వచ్చెడి విటులం
దాచుచుఁ బరస్పరంబుం
గోచరముం బొందకుండఁ గొనసాగించున్. 101
వ. అట్టియెడం గేశవుండు కోమలాంగిని విడువంజాలక యక్క
టా రొక్కంబు తక్కువయయ్యె నిక్కాంతయు మక్కువ
యక్కరణినె పెక్కు చిక్కులఁ బెట్టుచుండె. వీండ్రు నన్నుం
దృణంబునకన్న లఘుతరంబుగాఁ జూడందొడంగి రిచ్చోలువ
యుఁ బర్యవీక్షించనొసంగిన క్రొంగ్రొత్తనిపంద స్యోన్నైనను దో
ల్లింటికైవడి వచ్చుచుం బోవుచుండెదనని తలపోసె. 102
క. ఒకనాఁడు తలుపుఁ దీయక
యొకనాఁడు గృహంబునందు నుంచిరి ఘనులం
చొకనాఁడు రేపురమ్మని
కికురింపఁగ సాగి రప్పుడు కేశవరావునన్ 103
క. అట్టియెడఁ గేశవాఖ్యుం
డిట్టుముఁ బలుమాఱు పాప లీవాప్తిమన్సం

బుట్టిపడనాడె నిది నా
పట్టి యకట నీకు నెంత పైపైనుండెన్. 104

ఉ. నీచుఁడ నెన్నిసారు లిటు నీకు నొసంగితి సిగ్గు లేదె సం
కోచ మొకింత లేదె ముసలం జనియింపవె మా గృహంబునం
దాచఁగఁ బెట్టినావఁటర తాతల నాటి ధనంబు సర్వమున్
నీచెలి మింగవా యిటు మునింగెను మాధనలాభమంతయున్.

ఉ. కాసులు తెచ్చినావొ కనకంబులు దెచ్చి యొసంగినావొ కా
వీసమునైన నేమిగని నెచ్చుప్రసాదమొ కావొ లేక నీ
కోసమె యిందునుండెనను కొంటివొ మాకనకాంగి దుర్మతీ
నీసరి వారిఁ జూడవె యనేక ధనంబుల నిచ్చుచుండరే. 106

సీ. మీపితసన్నిధి దీపాంకురమ్ములు
సానికి రత్నభూషణము లాయె
మీమంత్రపుష్పముల్ మీపూజనమ్ములు
గణికామణికి చేరి కనకమాయె
మీమడి వల్వలు మీసదాచారముల్
వారకాంతకు జన్మబట్టలాయె
మీయిచ్చు దక్షిణల్ బీదాలకన్న దానముల్
చక్కఁగా వేశ్యకు రొక్కమాయె

గీ. యీయఁ గలిగిన వేశ్యల నెనయవచ్చు
నీయలేకున్న నవ్వలికేగవచ్చుఁ
బ్రార్థన మొనర్చి మిమ్ము రమ్మందు రెవరు
పదపదగదయ్య కబురులు పనికిరావు. 107

సీ. పైపైని పుష్పాలపూజఁ జరిగించు మనలేదు
గురుతర రత్నముల్ గోరలేదు

నిలువున ధనములు గలిగింప మనలేదు
లక్షలు దెమ్మని లాగలేదు
గ్రామంబు లిమ్మని ప్రార్థించఁగాలేదు
భూములిమ్మనుచును బోరలేదు
వెలలేని తొడవులు వేడుటయును లేదు
మొహరీలు దెమ్మని మూల్గలేదు
గీ. యిచ్చితివొ లేదొ మాకు నొక్కింతసొమ్ము
మిగుల నొసఁగిన పోలిక నెగసి పడెద
వెల్లవారలఁ జూడనే యుల్లునిండ
విస్తరాసలు వోతువు వేశ్యలకును. 108
సీ. పొమ్మని పలుమాఱు పోరిచెప్పినఁ గాని
యీఁడికిఁ గెలంబడ దింటిపంచ
వద్దువద్దని చెప్ప వాకిటి యరఁగుపైఁ
బవ్వళించెద నంచుఁ బల్కెదవుర
తలుపుఁ దీయ నటంచుఁ దెలిపినఁ బోవక
ప్రతిమాలుకొందువు పలుతెఱఁగుల
సమయంబుగాదని చక్కఁగాఁ జెప్పిన
దొడదొడ లోనికిఁ దూఱుచుందు
గీ. వార నిన్నెన్ని కంకిన నోరు నొప్పి
నీ రమణి నెవ్వరికినైన దారవోసి
వచ్చితివె వేరుగతిలేక వారకాంత
పొందు సిబోటి వానికిఁ బొసఁగు నటర. 109
గీ. అప్పుడప్పుడు మాయొద్ద నప్పుగొంటి
వేడువండలు వడ్డితో నెంతయగునొ

యిట్లా వాకిలియో యమ్మి యియ్యవేని
యట్టి పత్త్రము నీపనిఁ బట్టకున్న. 110

గీ. అట్లు బల్కుచునుండ హేమాంగివచ్చి
తల్లిపై గద్దరించుచుఁ దగవరి వలెఁ
జాటిసేయకుఁ డీవృద్ధ మాటలనుచుఁ
గొంకులేనమున నాతని నింటి కనిచె. 111

శా. అంగామామణి తల్లి కేశవునకుం బ్రారంభమందుల్లస
న్నీరంబై కరకంబునై హిమఘన స్థేమంబునై మౌక్తికా
కారంబై శశికాంతమై స్ఫటికమై క్రందైన వజ్రంబునై
ధారాళంబుగ దానిమీఁదను తుదం దర్శింప నానాటికిన్.

వ. అతండు నిజగేహంబున కరిగి యొక్క పేటకపై నుత్తరీయచే
లంబుం బరచి పవళించి, భూతావిష్టుని తెఱంగున, సమ్మ్రమో
యున వానిపగిది, బ్రహ్మహత్యఁ జేసినవానికైవడి, రాజదండ
నంబున కలవడిన వానిచాడ్పున, వృశ్చిక దష్టుని విధమున,
కెమియుఁబోఁచక, యిట్లు చింతింపం దొడంగె. 113

ఉ. అంటిటు నన్ను చెప్పవిననైతిని మున్నొక యప్పుడైన నీ
కొంపలమంద నాకిపుడు కూడునె నీరములెల్ల బోవఁగాఁ
దొంపరఁ జెంది సేతు విడు దుర్మతినైతిని చెప్పువారలే
పండలుగాక చెప్పటకు వచ్చెదరే నను బోఁటి మూర్ఖులోన్.

ఉ. కేశవరావుగారనుచు ఖేలనమాడిరి వీండ్రు మున్నుగాఁ
గేశవరావటంచుమఱి కేరుచుఁబల్కిరి కొన్ని నాళ్ళకుం
గేశవుఁడంచు నాపయుని కేరడమాడిరి నాఁడు నాఁటికిం
గేశ వటంచు నన్ననిరి కేవల విత్త కృశత్వ రీతిచేన్. 115

ఉ. ప్రత్యహ మింతసొమ్ము తన పాణితలంబున బెట్టుకున్నవై
యాత్మము జూపి ద్వారమున కడ్డముదాకుచు నెన్ని చెప్పినన్
వ్యర్థయు వాక్యముల్ వలికి యవ్వలికంపుచు బాపిముండ ప్రా
ణాత్యయము మాచరించు వెలయాండ్రదరతుల్ నరకంబు లెంచగన్

శా. హాలాపాన విలోలచేష్టుడగు మూర్ఖాగ్రేసర మ్లేచ్ఛుడా
బాలకపుల్కముబూని నన్నిటుల ద్రిప్పంజూచియే యంతయో
కాలంబున్ వ్యయ నలంచు లోజని బలత్కారంబునం బట్టియు
ద్వేల ప్రక్రియ నిచ్చదీర నడచెన్ వే సమాకృష్టి చేన్.

సీ. సౌర నారుల పేరు నారజేయుచు మీలు
సారుతో బ్రాహ్మణ జాతితోడ
పెంచి యచ్చరమేలి మచ్చికంటుల ద్రచ్చు
తీరుతో క్షత్రియ వీరుతోడ
నిక్కి జక్కుల తెక్కు చెక్కు కల్కుల ద్రొక్కు
నీటుతో మేటి కిరాటుతోడ
పాప పాపలకోపు రూపు మాపగ నోపు
నేపుతో నొకగొప్ప కాపుతోడ

గీ. చెలువు దక్కగా [illegible] తోడ
నంతటికి నన్నిరూపులై యమపు తేర్పు
గలిగి మెలగెను వల వెలకలికి యూర
దానిమాయలు దానికే తగును మహిని, 118

సీ. పరవంచనా ప్రీతి భాక్కులు వాక్కులు
దుష్పథ వర్తన ధుర్య చర్య
అఘ సంచయాలంబ యష్టులు దృష్టులు
జిహ్వా సరోజ్యక్తి సుప్రహ్వ జిహ్వ

ఆ. కులము నడఁగ బోదు తలఁపదు వృత్తిని
వావి లేదు మార్దవంబుఁ జూడ
దమల రూప మెంచ దర్థము ముఖ్యంబు
పడఁపు చెలికిఁ గలదె పరువు నుఱవు. 122

క. అంతటి వానికిఁ బుట్టితి
నింతటి దుర్వృత్తి గలిగె నేమననీక నా
కంతయుఁ జెడిపోయిన నే
నింతట నీతెల్వి గలిగె నేమిఫలంబో. 123

క. ఈ యెఱుగుపైని మును నా
రాయణశాస్త్రియును నేను నతిహాస్యమునం
బాయక భాషించితి మిప్పు
డీ కూటట మెంచవలసె నివి కాలగతుల్. 124

క. అని చింతించుచు వారాంగన
యున వీనులు మూసికొనుచు నాత్మగృహమునన్
జననికిఁ గులభామినికిం
జనువుగ ననుకూల వృత్తి జరుపుచునుండెన్. 125

క. దక్షాధ్వరశిక్షా పర
యక్షాధిపబద్ధసఖ్య మైశ్వర్యనిధీ
యక్షాధిపగంధర్వా
విక్షతకుసుమాస్త్ర గర్వవినతసువర్వా. 126

క. చుక్కల జేనిం దలపై
నెక్కించిన జేడవేల్పు టెట్టి సరమునం
జక్కనగు జడలవాఁడా
ప్రక్కం జెలిగలిగినట్టి వన్నియకాఁడా. 127

మదనదర్పణవృత్తము.

సామజరిపువాహనా విభాసమాన మానసా
శ్రీమహీశవిస్మృత పమూనిసాధిత స్వరూపకా
నామజప నిరాకృతోరుబంధ భక్త సంచయా
హేమనగ శరాసనంధితాహి సింజినీవరా. 128

గద్య.

ఇతి శ్రీమన్మంత్రిప్రెగడ వంశ పయఃపారావార రాకాసుధాకర
రాజబిరుదాంకిత భుజంగరాయామాత్య పౌత్ర హరితస గోత్ర
పవిత్ర దుర్గామల్లికార్జున ప్రసాదరాయ వరపుత్త్రి శ్రీమా
ర్కండేయ వర ప్రసాదజనిత కవితాధౌరేయ బుధ
జనవిధేయ భుజంగరాయనామధేయ ప్రణీతం
బైన వారకాంతయను చాటుప్రబంధంబు
నందుఁ జతుర్థవిలాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీ రస్తు.

శ్రీమార్కండేయస్వామినే నమః

---

# వారకాంత

---

## పంచమవిలాసము.

క. శ్రీనాథ ప్రియ సుగుణాని
ధానా, రజతాద్రి సన్నిధానా, భక్తా
ధీనా, భుజంగభూషణ
మౌని జనావని విధేయ, మార్కండేయా. 1

గీ. విన్నవించెదఁ బైకథ వినుము దేవ
కేశవుండిట్లు ధన మాసు కేళి పాలు
చేసి దుర్వ్యసనుండై క్లిష్టచిత్తుఁడగుచుఁ
దల్లడిల్లఁగ మెల్లనఁ దల్లి మునియె. 2

ఉ. ఏమి విచారమందెదవు నెవ్వరు చెప్పిన నమ్మవాయె నీ
నెలల నమ్మదియు విధి కేవడి జేయఁగ నేల దప్పునో
బాలిక యన్న హీనులయి ప్రాణముల న్విడు వారలుందురే
మేలొనఁగూడకుండదు సుమీ చిరమాయుస్సుగల్గె నీయున్

చ. వదలుము చింత పెండియును బైడియు మ్రోగుచునుండు సంతసం
పద గల కొంపకిట్టి నగపాటులు బొందఁగ నవ్వ్యా నకటా
చదరయు గాకయుండునో కో చాపచినింగిన సన్నవస్త్రముల్
కొంచరక గల్గు సంపదలకు న్మును నోచని పట్టు గల్గెనున్. 4

క. పసవునకై నీభార్యకు
నొసఁగిరి పుట్టింటివార లొక్కింతమహిం
బొసఁగం దానం దీసం
గుసుమము గతిఁ గాపురంబుఁ గొనకొని నిల్పెన్. 5

శా. కైవారంబుగ దోఁచునో పరులకుం గానిమ్ము వాక్రుత్తు ల
క్ష్మి వాణీ గిరిజా సమాన యగుచున్ మెప్పొందు నీభార్య నీ
భావం బిట్లు కలంగుచుండ మనితోఁ గల్యాణి చింతించి న
న్నిష్ఠ వాక్యంబులు చెప్పి పుచ్చె నదియే యెంచంగ శ్రీదేవిరా

క. అశలున, గార్హ్యస్థ్యం బొడవును
పొడమును మోహంబువలనఁ బుట్టి ఘనముగా
నడచెంగ నేటి కీగతిఁ
దడపడఁగా నాటి కొక్క దైవము లేదే. 7

ఆ. తల్లి లక్క యంట తనయులు తొలఁట
యంత కోనుఁడైన యట్టి సుతుఁడు
గాథ తాపమందఁ గఱఁగక యుండెనే
వ్యర్థమానె లోక వాదమెందు. 8

మ. అనినం గేశవరావు కొంత మది ధైర్యం బంది చింతించె హా
నను దుష్టాత్మునిఁగాఁగ లోఁ దెలిఁగియున్ నాతల్లియిన్నిఁజె
ప్పెను నాభార్యయు నిట్టి దుష్టునిపయిం బ్రీతి న్విడన్లేదు కా
ల్పెనె నా జన్మము నట్టి యుత్తమ సతిం బల్వంతలం బెట్టితిన్.

వ. ఇట్లు చింతించి మున్నెంతటి దుర్మార్గంబునం బ్రవర్తించె
నంతటి సన్మార్గంబునకు మరలి సాంసారిక కృత్యంబుల నతి
జాగరూకుండై ప్రవర్తించుచుండె నంత, 10

ఉ. పాపయి నొక్కనాఁడతఁడు వ్రాసినపత్రముఁ జేతఁ గొంచుబల్
పాపపు వృత్తిఁ గేసెప్రని వజ్జకు వచ్చి యతండు తన్నుఁ జూ
పాపని గుండె జల్లుమన నోర మొగంబెట్టి చూడకున్న న
య్యా పఠికించు డీని నని హాస్తమునం దిడఁబోవ నాతఁడున్

క. అది ఏమి తెల్పు మనపుడు
బదులున కీవిచ్చినట్టి పత్రం బనినన్
బదులెక్కడ నే నెక్కడ
బదపద పత్రింబ దేడ పాపచరిత్రా ! 12

వ. అనిన నాపాపయు, 13

శా. ఏలా యింత యసత్యమాడెదవు నీవింకా నపఖ్యాతికిం
బాల్పై పోదువు పత్రి మీవెఱుఁగవో పైపైని బోనియ్యనే
వ్రాలే కావో సాక్షులుండిరి నిసుంబల్కించెదం బాస సా
మ్మ్యాలేకున్నను బాదమధ్యమునఁ బామొమ్మాటినుమ్మాౌ ననన్

ఉ. చెల్లని మాట లేమిటికిఁ జెప్పెద వీక్రియఁ బొమ్మపొమ్మ నీ
వల్ల ఋణంబు దీయుటయె హాస్తమునందు వచింతువేని నీ
ముల్లియు విప్పి యిచ్చితివె ముట్టెడ వే గురుపాదపద్మ మీ
యల్లరిఁ జేయ నేల వదమా వదకుండిన బుద్ధిచెప్పెదన్. 15

క. పాపా చేయఁ గడంగితి
నీపేరున కుచితమైన కృత్యం బహహా !
ఛీ పో నా ప్రాంగణమున
నేపనికై నిలచియుంటివే దుష్ట యనన్. 16

ఉ. శంక యొకింత వీడి యనసాఁగినచో మఱి సాఁగిపోవునే
యింకను బోవ నీవరుపు నేకక నేఁ బదిమంది చెంగటం

బింకము వచ్చెనేనియును బాయుట దుష్కర కార్యమౌఁజుమీ
బింకపు మాటలం బెదరుబెట్టినఁ బోవునె పాట సానియున్.

ఉ. సానులఁగూడి కులుకుచును సౌఖ్యముఁబొందిననాఁ డెఱుంగవే
మానవు డీని శీలమని మాయెడ లూరకయున్న కుంటిమే
సానికి మేను ముల్లెగన చక్కఁగ సొమ్మిడఁ జాలవేని యో
మానవిహీన చెల్లెలిని మక్కువతోఁ గవగూడ కుంటివే. 18

సీ. మాటాడెనేనియు మాడ మూల్యంబౌను
సరగనరాగద సరసమాడ
సరసము కూర్చున్న వరహాలు రెండౌను
గొంగుదాకిన మూఁ డిడంగవలయుఁ
గరముచేఁ బూసినఁ గాసువెచ్చంబౌను
గాఁగలించిన రెండు కాసులౌను
ముద్దాడెనేనియు మోహరీ వెలయౌను
వాతెఱ చవిఁజూడ వందయౌను

గీ. రూప్యమునకి నక్ష మీవలెఁ గోటిసైన
వారభామిని యన్నఁ బైపైనిఁ గలదె
యిప్పుడు మగనాండ్రె వేశ్యలై యింట నింట
సిద్ధముగ నుండ్రు మాకూడు చెఱచుటకును. 19

ఉ. ఇన్నియుఁ జెప్పినం బలుక వెంతటి కూళతనంబొ కాని యా
పన్నత వచ్చు నేమిటికిఁ బాడయి పోదువటన్న నీవు ది
క్కున్నకడన్ వచింపు మిటనుండక పొమ్మని కేశవుండనం
బెన్నడివీధి నొర్కలఁదిఁబోలుచుఁ బోయెను బౌరులల్కగన్.

క. అమ్మయుఁ గొమ్మయు నకటా
యిమ్మెయి విడిపోవకుండె నిప్పటికిని రే

ద్రిమ్మరి యని పలుదెఱఁగుల
యమ్మలికల నాత్మ నొందుచుండఁగ నంతన్. 21

క. సవయసులుం బ్రవయసులున్
సవిధంబున కేగుదెంచి నర్మిలితోడన్
శివశివ యింతటి యంకిలి
భవమునకుం దెచ్చె నెంత పాపము యనుచున్. 22

ఆ. వృక్షమెల్లఁ గొట్టి వ్రేల్మింధనములకుఁ
గాఁగఁ బెల్లగించు కరణిఁదోపఁ
గాఁపురంబు నెల్లఁ గడ తేర్చి యివ్వేశ్య
తడవ వచ్చె నార కడమ దిపుడు. 23

ఉ. ఏటికిఁ బత్త్రమిచ్చి తిది యెన్నఁడు మాకడ నుచ్చరించ వై
[illegible]టము లేక వ్యాజ్యమిడ నుంటినటంచును వాగిపోయె నా
చేతుల నూరి యంతపనిఁ జేయగ సందియ మంద దిప్పుడా
ప్పాట మరల్పఁగావశమె బ్రహ్మకు నైనను దుష్ట యాటచేన్.

చ. మునసబుగారు జారుఁడును మూర్ఖుఁడుఁగావున వారకామినీ
జనముల కార్యమన్న శిరసావహియించెడు నొక్కరాత్రి య
క్కనికియు వానిఁజూచి యరగంటకుఁ గార్యమునిర్వహింపదే
మనకును గోర్టుకుంజనుట మంచిదఁటే వెఱియాలి వెంబడిన్.

క. మన మోఁడుట యదికంప్లెం
ట్నొనరించినఁ దప్పుదింక నోసర నెకస్సా
ట్రని దీర్పుసేయ నిమ్మా
మును జేసిన కార్యఫలము బొందక వశమే. 26

వ. అనిన నెద్దియుం బలుకక తల వంకించుచు నున్నరని యెట్టి యుం దోచక కొంత తడవు చింతించి తన దుర్వృత్తంబునకు రోయుచు గడసపడంతుల దుశ్చేష్టితంబులం దలంచి యిట్లనియె

ఉ. చేసితి నెన్నియేని చెడు చేష్టల నేల గణింప వానిలోఁ
జేసితి నిద్దియు న్నిఁగులఁజేసిన దానికిఁ జింతయేల నా
వాసియు వన్నెయుం దఱిగె వాఁడొక కేశవరావు వీఁడుగాఁ
డాసనుయంబుసం బుడమి యాకసముం గనడాగుచువాఁడసాకో

ఉ. కోకఁ బటంచు మేల్ అనిక గుడ్డఁ బటంచు విభూషణంబులం
చీకరఁ జీన్ సమస్తవసువిక్కువలం గనిపట్టి మెల్లనం
గైకొని శేమిచెప్ప నిదిగాక శరీరము దుర్వ్యధామయ
వ్యాకులమాటఁ గొంత వ్యయమయ్యెఁ జికిత్సక వేతనంబులన్

ఉ. ఈలువఁబట్టాంఁడ కన్నఁ గను వెచ్చగు మాటలు చేష్టలెంచ దు
శ్శీలము లంతరంగము లశేషజనార్థ సమూహహృతి క్రియా
లాలస దుష్టము ల్వెలపొలంతులనుం దురితంబు లెల్ల నీ
పోలిక ముద్దఁజేసి నలుమోముల వేల్పు సృజించె నిమ్మహిన్.

శా. విశ్వద్రోహిణులైన వీరిపొడయు న్వేమాయలం ద్రోచు న
వ్విశ్వామిత్రుని ఋష్యశృంగునిఁ దపస్వి న్వ్వరనారాయణు
న్విశ్వాసంబున మోసపుచ్చి రొకళుల్వేయింటఁ బొర్ధామలీ
విశ్వంబందుఁ దృణీకరింతురుగదా వీంద్రఁగా మహాశైధైర్యులై.

సీ. ఒకఁడిచ్చు వి త్తంబు నిశనించి పుచ్చును
వేఱొక విటునితో బేరమాడు
నొకనిని శేపు తప్పకరమ్మనుచుఁ జెప్పు
నొకనిపైఁ గోపంబుఁ బ్రకటపఱచు
నొకని లాలనఁజేసి యొ

జేరిక నొక్కని గారవించు
ననుర క్తి నొకనికిఁ గనఁజేయు నొకనితోఁ
బ్రాణంబు నీవని పల్కుచుండుఁ

గీ. జెఱుగు కొంగలు ద్రొక్కిన మఱుగు వేశ్య
రోగములపుట్ట విత్తముల్ ద్రోచుదిట్ట
భోగనారి యనందగు రోగనారి
దానిఁ జూచిన నిహపర ధర్మమణఁగు 32

గీ. వృద్ధరాక్షసి యొక్కతె గృహమునందు
నుండి జారుల సొమ్మెల్ల నొడిచి కొనఁగ
దానిలుంగని క్రియ మహాన మూని యుండుఁ
గనుఁగొనఁగఁ జాలు నెవ్వండు గణికమాయ. 33

క. ఇప్పగిదిఁ గేశవాఖ్యుఁడు
జెప్పఁగ విని యబ్బురంబు చిత్తములందుం
జెప్పరముగ వారుంజని
రప్పుడు నికేతమున కరిగి వశివశిగా. 34

క. చని యంతయుఁ గనకాంగికి
వినిపించిన నదియు మిగుల వేఱంబొప్పం
జనుమిప్పుడె ప్లీడరు కడ
కనపుడు వెస నేగి యతని కనియెం గినుకన్. 35

ఉ. కృత్రిమ వృత్తిఁ గల్గి యల కేశవరావు మదీయ పుత్రితోఁ
జిత్ర విహారముల్సలిపి చేత నొకంపు ధనంబు లేక యీ
పత్రము వ్రాసి[illegible]క్షియుఁ గూడిన వేయియప్పు
మాత్ర[illegible]లు వల్కెనుగాననీయె

మ. ఇటికం జ్ఞుల్గొ సరించఁగానటెఁ జూఁడీ యీకార్యమేరీతిగాఁ
దడిం బొప్పఁగఁ జేతురో మముఁ గృపాపాంగులై చూడుఁడీ
తుదకీ వ్యాప్తము నిర్వహించునొకో లేదో చక్కఁగాఁ జెప్పుఁడీ
చదురెక్కం జెడిపోవకుండ మొగటం జాలించుచే మేఁగుఁడీ.

క. అన విని క్లీడపు చీటిం
గని తప్పక గెలుచు నిట్టి కార్యంబులు గో
టను మీటితి నెన్నినియుఁ
జనదుసుమీ పాప సీకు సంజేపింపన్. 38

గీ. దీని కేమది సూపాయతోను శిబ
బహుమతులు గెల్వనేని యూహైనఁగలవు
కార్యమెఱుంగని దానవు గావు గానఁ
జెప్ప నేటికి ననిన వచించె నదియు. 39

మ. తమకు న్నందియమంద నేమిటికి మీతాత్పర్య రీతి న్సమ
స్తము మాటాడఁగ నాతనూజ యిటకుం ధావచ్చునీరాత్రికిన్
మముమీవాంఛనుగాగఁ జూడుడనుకంపావృత్తిని కార్యము
న్నమకూర్చుం డటు పైనమ స్తముయథేచ్ఛన్ మీకు సంధిల్లెడున్

ఉ. ఆజ్యహుతాగ్నిఁబోలెనిటులుల్లసిల్లుచుఁ బాపయుఁజెప్పగా యసా
మ్రాజ్యము చేతికబ్బిన క్రమంబున నాతఁడు సంతసింపుచున్
సజ్యశరాసమందు శర సంధి యొనర్చిన పోల్కి సూటిగా
వ్యాజ్యము వేసె గేవృగృహంబు నుముంచదలంచి యాంతటన్

శా. నీచ స్వాంతము గల్గు పాపయుఁ గ్రియూ నిర్వాహసంసక్తి చే
నోచం గ్రానన క్లీడరు న్మనసులన్ యుక్తోక్తులం జెప్పుచున్
నీచాతుర్యము మీఱఁగా బలుచితేనిం గార్యమా సంచు దు
ర్వ్యాచా బోధన మాచరించి యనిచె న్వారిండ్లకుంబుత్త్రికన్

చ. అనిచిన నద్దియోగి తన వ్యాప్యెప్పు సంగతు లెల్ల మెల్లనం
గొనకొని చెప్పి వారి యెడకుం దగ రక్తిజనింపఁజేసి మీ
యనుమతి చొప్పునన్నడతు నంతయుమీరును స్వకార్యముల్గాఁ
గనుఁగొనుఁ డేను సైతమును గానొకొమీ పరిచారికామణీ

ఉ. అంగన మోముఁజూచిముని యంతటివాఁడుని మేనుపూత్రలో
లొంగును బ్రౌఢయౌ నల విలోల విలోచనఁ జూచునంత ను
ప్పొంగడె జారముఖ్యుఁడగు మున్సబు వానినిఁ బుఱ్ఱరంచు వో
సంగ మెఱుంగఁ బెట్టిబనిసైన నొనర్చుట యబ్బురంబొకో.

క. హాటక గాత్రి నీకిం
కేటికి సందేహమండ ఖగముని నిరా
ఘాటముగఁ గేళిసలుపఁగ
నోటీ సొనరించ నల్లఁడు నోగు బాగవంకా. 45

గీ. కాకమూనదు కానున్న కార్యమును మ
ఖారమెల్లను దైవంబు పైని నైచి
యూరకుండిన నధికారి తిరు పప్రుడు
జేసి జప్తున కార్డరుఁ జేసెనంత. 46

ఉ. దీప్త తరాధికారిక నిదేశముఁబూని యమీను గేహముల్
జప్తొనరింపఁ దల్లియును జాయయుఁ గేశవరావు నాస్తి సం
ప్రాప్తత దైవమా యిటుల రాపిడిఁ బెట్టెద విప్పుడే నియున్
[illegible]

క. వేలాము వేయఁగా నిరు
వేల వెలకుఁ దద్గృహంబు విక్రయమొందెం
జేలావశేషులై య
వ్వేళ న్మృప్పఁను వారు వెడలి వగచుచున్. 48

మ. ద్వాదశసహస్రప్రమితాప్య ముద్రికలలో వేయప్పుతీరంగ ను-
న్న సహస్రంబున రామదాస సుతుఁడుండనొప్పుచితాగారము
నొప్పసఁగంగాఁగొనివృద్ధబాంధవులు నాప్తుల్ చెప్ప నాలోచనం
బున నందుండెనుదైవయోగమున నిర్బంధించుచున్నిమ్మదిన్,

ఉ. కాంతుఁడు వారకాంత పయిఁ గన్నిడనష్టి తగకతానుఁదై
పంతము వట్టి తన్నుఁ బడవాదినయప్పుడు రథ్యరిత్తుఁడై
చింతలఁ గుంద నేఁడునొక చిత్తములోఁ బరిచర్యసేయు మక్కా
స్వాంగనునం దగాయు నివచాత్మకసన్నతి మొందసాధ్వియో.

చ. వివిధములైన భక్ష్యములు వేలుగ వేఁలుగ ద్రావిగమ్మఁగాఁ
జవులొనఁగూర్చి చేసి వలచానకుఁ జెన్నెప కంచొకప్పుడున్
సహితికి నంచొకప్పుడును జక్కని నవ్వు మొగంబు మీఱఁగా
ధవుని మతంబుచే నతఁడె దైవమటంచెద నమ్మి పంపదే.

ఉ. ఎవ్వరు నేనిఁ గేశవుని హేయపు కృత్యము లుగ్గడించుచున్
అవ్వలు చేయుచుండఁగ విననొకఁబోటఁ బినర్థ కన్యకా
దవ్వుగ నేగు నేటికి వృథాన్యవహారము లమ్మలార యం
చొవ్వని మాటలాడుఁ బ్రతియుక్తులఁ జెప్పును నవ్వనోరిమిన్.

సీ. వేకువ లేచుచు విభుని పాదములకు
నెరఁగక భువిఁ బాదమిడఁగఁ బోదు
అకొనివచ్చె నంచన్నంబు వెట్టక
వెంకనిఁ వేళ్ళొకపని [illegible]
కోపించె నేఁడని గుజగుజలాడుచు
నతని నెమ్మదిఁ జేయ కవలఁబోదు
వీధి కేగునటంచు వెలిముడుంగులనీక
[illegible]

గీ. ఏకతంబున నాతోడ నించుకంత
చిఱు నగవుఁ జూచుటయెకాని చెక్కుఁ దెఱచి
చిప్పు నను నవ్వఁగాఁబోదు చెలులతోడ
నెంతయని చెప్ప నచ్చు నక్కాంతచర్య. 57

గీ. ఈ తెఱంగున దలఁచుచు నాతఁడంత
నొక జమీందారు ప్రాపున నుండి యతని
చెంత వింశతి రౌప్యముల్ జీతముగల
మంచి యుద్యోగమొకటి గావించుచుండి. 58

వ. ఒక్క కాలంబున నాటపాటులచేష్టలు మనంబునాటఁ దనమి
త్రవర్యులకిట్టి కొఱగాని యెన్నఁడేని యలవడకుండ వారలం
బిలచి యిట్లని చెప్పందొడంగె. 59

ఉ. ఓజనముఖ్యులార! వినుఁడొక్క హితంబునచింతు మీరలున్
దోషనఁ జేయవచ్చు నిఖిలోర్వినిఁ గల్గిన జంతుకోటిలోఁ
బూజితుఁడౌ మనుష్యుఁడయి పుట్టిన మాత్రన వారి లోపలం
బూజితుఁడౌ విమర్శమునఁ బొల్చెడు జ్ఞానముఁ గల్గెనేనియున్

గీ. ఇట్టి సుజ్ఞాన వృక్షంబు నింద్రియగణ
పారవశ్య కుఠారంబు వేరుతోడఁ
బోనడంచును గానఁ దదుత్ఖాతి వృత్తి.
వశ్యుఁడగు వాని కంటెను బశువు గలదె. 61

క. పశువులు సుఖభోగంబులఁ
గృశియింపక యిచ్చనుండుఁ గేవల వేశ్యా
వశమున నుండెడు నన్నర
పశువే యీ బాధలకును బాల్పడి యుండున్. 62

క. వార స్త్రీకందంబుల
సిరోగలరేన్ జనించి యెంతటి బలియౌ
పూరుష వృషము కనియు
నారంగాఁ బ్రాఁకి ప్రాఁకి యడఁగం ద్రొక్కున్. 63

మ. కులశీలంబుల నెంచఁబోరు మఱియుం గుంటంధకుండౌనయా
కులుఁడున్మత్తుఁడురూపహీనుఁడుమహాఘోరాత్మకుండంచు నే
శ్యలు నెంచరు విత్తమిచ్చు నతఁడే సర్వోత్తరా కాఁగఁదుర్
వలరాజంసటివాఁడు మేటియనుచు న్వ్యాభింతురెంతేనియున్.

క. వెలయాండ్రకు విటులచిత్తము
వలలం జెచ్చెదరు మంచి పగలన్ మిగులం
గులకాంతా యుతి మోకమా
లలనకుఁ దులగాదు సద్విలాసప్రౌఢిన్.

శా. ఈ దుర్వృత్తుల సంచరించెదు సదా హేయాత్ముఁడౌ మానవుం
డౌ దైన్యంబుననుండి సాంఘిక జన వ్యాపార మేరీతి సం
పాదించం దుకక్కెద్ది దేశమునకున్ భంగంబుఁ గావించెదుం
గాదే యాయది పెల్లగింపఁగ నశక్యంబయ్యె నానాటికిన్. 66

క. శారీర సౌఖ్యమునకున్
మారిం గోడ్డంటిపెట్టు మానసమునకున్
ధీరతకు వేరుపురుగు
న్వ్యాగిజ భవ్రుఁడేం వేసె నాగసమూటిన్. 67

ఉ. వింత జనించు నీపడుప్రవృత్తి ప్రధానముగా జరించు ని
క్కాంతలు హిందు దేశమునఁ గానఁగవచ్చెద రన్య దేశముల్
పంతము పట్టి చూడఁ గనుపట్ట రదేమొకో నిర్నిరోధమై
యింతటి దుష్ప్రవృత్తి యిట నెప్పుడు బుట్టెనొ యెప్పుడట్టెనో.

ఉ. బింకము లెన్నిరో పలుకు వీరలు వీరినిఁ జూచునంతకున్
శంకయుఁ గొంకుఁ ద్రోఁచి యతిసాహసవృత్తిఁ జరింపవారి ప
త్పంకజ సేవఁ జేయుటకుఁ బొల్పడి సత్సభలోపల న్నిరా
తంకముగాఁగ బూజ్యతను బొల్పుచునుండు రహించిత్రమో.

కం. కుల గురువులైన వారలు
వెలిఁ బెట్టం దలఁప రిట్టి వృత్తులలోనన్
మెలఁగెను దుష్టుల నేమనఁ
దలియంగా రాదు వారి తీర్పులలోకో ? 70

కం. జారత్వమునకుఁ జూడ న
గారవ మొనఁగూడకుండెఁ గావునఁ దస్వై
త్తారంభలయి చరించెదు
వారస్త్రీలకును గారవంబులు వచ్చెన్. 71

సీ. సర్వసత్కార్యౌఘ ఝురముల కిమ్మహా
వ్యభిచార మరయంగ నష్టకట్టు
దృఢతరమై యొప్పు దేహవృక్షమునకు
జారత్వ మరయంగ వేరుపురుగు
దంపతీ సౌఖ్యముల్ దగ్ధము సేయు
విటవృత్తి యరయంగఁ బెట్టునుండు
స్వర్గలోక ప్రాప్తి సరణికి నిజముగా
వెలిచవి యరయను బెబ్బులులతోఁడు
గీ. ఇట్టి దుర్వృత్తి మున్నతి హేయమనాట
నృత్తగీతాది విద్యలు నేర్చుచుండి
జనుల కానంద మొనఁగూర్చు వనిత లిప్పుడు
జారత్వ వృత్తి సాధ్యముగా జరుపుచుండ్రుఁ 72

శా. సంగీతం బహిముఖ్య తుష్టికరమై సామాన్యమై యందుమ
ద్వాంగుల్ కంఠములెత్తి పాడు నెడ నయ్యానంద మేమందు నీ
భంగిన్ భూరి రసజ్ఞ చిత్తములకున్ వారాంగనల్ జాల తు
ష్టిం గావింపఁగఁ జేయుఁగాఁ బదిరి నేఁ జెప్పం గలన్మాటికిన్.

క. తుదకిది లంజెటికమునకు
మొదలై నానాటఁ జెఱఁగి ముదురుట వలనన్
మదవతు లదియే వృత్తిగఁ
గొదుకక చరియించుచుం డ్రికుంఠిత మతులై. 74

గీ. దేవదాసు లటంచును దేవళములఁ
నృత్త గీతాది విద్యల నెఱపుటకును
మాన్యము లొసంగి యుండ్రు సామాన్యముగను
నిట్టి సంగతి మీఁదలు నెఱిఁగి సదియు

శా. వీరల్ వ్యంజక నృత్తగీత ముఖ సద్విద్యాప్తి నానాటికిన్
జారత్వంబున కంగ విద్యలుగ నాఁబన్నంబు మోసంబులం
బ్రాపంచించెద రిట్టి కీడు మనసుం బ్రాపించకుండంగఁ బల్
తీరుల్ ఛిందనఁజేసి చేయుఁగవలెన్ దిట్టంబు లెన్నేనియున్. 76

ఉ. అంపుచు కొండఱాత్మ దృఢమైనను మోసము గాదటంచు వా
రంపుటు నింతి కంటఁబడ నంతకు ఖేదలెయాపు రయ్యరో
కంపము లాకులుం బుప్రులుగాలియు మెక్కి మహర్షి వర్యులున్
సుందరి గాలి సోకి బలు చోద్యముగా నవుగంట కుండిరే.

శా. స్త్రీ మోముం గని మోహ మందిరి తపో జీర్ణాంగులై నట్టి వి
శ్వామిత్రాదులు నిష్పృష్ట రసముల్ భక్షించువా రింద్రియ
గ్రామం బన్నదురేనిఁ దేలనుగదా గ్రామంబు మున్నిట్టిగా
సామాన్యంబులె యింద్రియంబులుకసున్నాసాధించుసత్త్వంబితున్.

గీ. బూటకంబు లబంధము బుద్ధినుంతు
విట్టి యుక్తుల నెల్లను నెఱుఁగవచ్చు
నహహా యీరీతి మచ్చెట్ట లీనయించ
నఖిల దేశంబు చెడుటెంత యద్భుతంబు. 84

మ. తనకుం బూర్వులొసంగినట్టి ధనముల్ దగ్ధంబులై పోవ నిం
టను భార్యాదులు గుందుచుండఁగను భిక్షాన్నమై యేన్వఁ జి
య్యున సూతాసిక్త పోషితంబయిన దేహంబెల్ల జీర్ణింపఁ ని
ష్ఫలం జేయుట యేమిలాభముగునో భావింపఁడీమిత్రమా.

సీ. తండ. కానదమును మేను గాన నేక
గురుల యుపదేశములు గ్రోలి సరస విటులు
వేశ్య జన్మానమంతయు విలుత మనుచుఁ
దలలు ప్రక్కలుగాఁ [illegible] 85

వ. విద్యాభ్యాసులగు కొందఱు గణికల నుద్దేశించి యిట్లనిరి. 86

క. నమ్మకు నమ్మకుమప్రవి
ణామ్మ్రనమై వేశ్య యెన్ను నప్పాంగుల శి
లమ్ములు గల పురుషుఁడు మన
నమ్మున నొాప్పను విరి యున న్వాడవలయున్. 87

గీ. వేశ్యఁ గాంచినఁ జిత్తము వికలమౌను
ధనము దఱుగును ముట్టంగ దానిఁ గూడ
నఘము లొనఁగూడుఁ గానఁ బ్రత్యక్షముగను
రాక్షసిరౌ భూతమో వారరమణి తలఁప. 88

క. నటులుం భటులుం జోరులు
విటులు నునిుము తమ్మపడిగ నెలజెలి యధరం

మత్తకోకిల

పౌరుహూత మణీ నిశేణ్మణి భాస్వదంగక రత్న వి
స్ఫార నూపుర నిర్మల శ్రుతి జాల నూపుర పాద కా
శ్మీర సంభవ రేణు భస్మ విశేష రేణు విభూషితా
సార కాంచన కంకణౌఘ భుజంగ రాజ విభూషణా. 101

గద్య

ఇది శ్రీమన్మంత్రిపెగడ వంశపయఃపారావార రాకాసుధాకర
రాజబిరుదాంకిత భుజంగరాయామాత్యపౌత్ర హారితసగోత్ర
పవిత్ర దుర్గామల్లికార్జున ప్రసాదరాయవరపుత్త్ర శ్రీమా
ర్కండేయ వరప్రసాదజనిత కవితాధౌరేయ బుధ
జనవిధేయ భుజంగరాయ నామధేయ ప్రణీతం
బైన వారకాంతయను చాటు ప్రబంధంబు
నందుఁ బంచమవిలాసము సర్వము
సంపూర్ణము.
శ్రీ. శ్రీ. శ్రీ.



---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B102 |
| పుస్తకం పేరు | వారకాంత |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| | Mounika |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |